# ఎల్లారెడ్డి గాయాలు

## (హృదయావేదన)

రచయిత :

**విద్వాన్ రాయరె**

తెలుగు పండితులు

ప్రచురణకర్తలు :
డా. సూర్యనారాయణరెడ్డి. రా. చంద్రశేఖరరెడ్డి
కొండారెడ్డికోట. నల్లచెఱువుపల్లె గ్రామం
వేముల మండలం, కడప జిల్లా (ఆం. ప్ర.)

## -: విషయసూచిక :-

# తొలిపలుకులు

పుస్తకము పేరు "ఎల్లారెడ్డి గాయాలు" రచయిత విద్వాన్ 'రాయరె' అని ఉన్నందున ఎల్లారెడ్డి వేరు "రాయరె" వేరని చాలామంది సందేహింపవచ్చు ఎల్లారెడ్డివేరు, రాయరే వేరని కూడా కొంపరు విమర్శకులు మున్ముందు వ్రాయవచ్చు. రాంరెడ్డి యల్లారెడ్డి అనుపేరులోని పుటాక్షరములను తీసుకొని "రాయరె" యనునామమును వ్రాయుచున్నాను. ఆంగ్ల సంప్రదాయము ప్రకారము **R. Y. R.** అని వ్రాయక ఆంధ్ర సాంప్రదాయ ప్రకారము రాయరె అని వ్రాయుచున్నాను. కవిత వ్రాయుటకు మొదలిడిన దినములలో నిట్లువ్రాయుచు తర్వాత (విద్వాన్ A) టైటిల్ పొందిన తర్వాత "విద్వాన్ రాయరె' అని వ్రాయుచున్నాను.

నేను శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యకళాశాలయందు విద్వాన్ ఎ. (సంస్కృతము మఱియు తెలుగు) చదువునపుడు సంస్కృత పాఠములు శిరోమణి విద్యార్థులతోపాటు, తెలుగుపాఠములు **B** విద్వాన్‌వారితో కలిసి చదువుకొను దినములలో చేబ్రోలు సుబ్రహ్మణ్యంశర్మగారు "అప్పకవీయము" పాఠము చెప్పేవారు, వారు సరస్వతీ విహారములో ఉత్సవముచేయుచూ వారినిగూర్చికవితలు వ్రాయమనిరి నాకు. మనుష్యులను పొగడివ్రాయుట నచ్చదు, అందుచే నాకు వ్రాయుశక్తిలేదని చెప్పితిని. వారప్పుడు కోపగించుకొన్నారు, నేను సంస్కృతములో కొన్ని శ్లోకములు వ్రాసి క్రింద "రాయరె' అనిపెట్టి పంపి ఉంటిని మఱుదినము తరగతి గదిలో ఏదోచర్చ వచ్చినది. వారుపాఠములకంటె చర్చలతోనే ఎక్కువ కాలము గడుపువారు. ప్రతి విద్యార్థిపేరు పిలిచి వారి నామౌచిత్యమును తెలుపుచుండిరి. నాపేరువచ్చినపుడు "ఎల్లారెడ్డి, పుల్లారెడ్డి,

మల్లారెడ్డి" ఏంటిపేర్లు? రాయలసీమవారికి ఎక్కువగా ఉండును. ఏమి అర్థము గలదు అని హేళనగా మాట్లాడినారు. తెలుగువారికే తెలుగుపేర్లు బాగుండవా? అర్థములేని పదము ఏమున్నది. 'ఎల్ల' అనగా సమస్తము అని అర్థముకలదు ''ఎల్లలోకములకు ఎవ్వడు నాథుడు అట్టి దేవదేవునాశ్రయింతు'' అను ప్రయోగము గలదు. ఎల్ల అనగా హద్దు అను అర్థముగలదు, రెడ్డిశబ్దము ఱేడుశబ్దము నుండి వచ్చినది. కాన సమస్తమునకు రాజు అనగా? చక్రవర్తి అని అర్థము. సామ్రాట్, సార్వభౌముడు. అను పేరువచ్చును. అంత గొప్పపేరునకు నేను అర్హుడనుగాను కాన "రాయర" అని పెట్టుకొన్నాను అని చెప్పితిని. అట్లే "మల'' అనగా కొండ (అమ్మలగన్నయమ్మ) కొండారెడ్డి మల్లారెడ్డి అన్నను ఒకటే. "ఫుల్లా" అనగా వికసించిన అని అర్థము. పుల్లారెడ్డి దాని నుండి వచ్చినదని వివరించితిని. (శైలజ అనగా కొండమ్మ కొండకూతురు అనిగదా? మన పూర్వులు గొప్పగొప్ప సంస్కృత విద్వాంసులు కూడ తెలుగుపేర్లనే పెట్టుకున్నారు. అయినా పేరులో నేమున్నది.

అదిఒక గుర్తు. బిల్హణ. మల్హణ అనుపేర్లు సంస్కృత కవులకు కలవు. ఇక తెలుగు కవులపేర్లు నన్నయ్య. తిక్కన్న, ఎర్రన్న, తిమన్న, పెద్దన్న. చిన్నన్న, సోమన్న, సూరన్న. మారన్న, వీరన్న, మల్లన్న, గలవుకదా! వారు ఈనాడు పెద్దపెద్ద పేర్లుగల. జగన్నాథుడు, విశ్వనాథుడు, శ్రీనాథుడు మొదలగువారికి తీసిపోరుగదా! అని బదులు చెప్పితిని. పూర్వము మనకవులు చాలానిరాడంబరముగా ఉండెడివారు. సదాచార సంపన్నులై తాను పునీతుడైన తరువాతనే ఇతరులకు బోధగావించెడివారు. ఇపుడట్లుగాదు. కవిత్వమంటే ఏదైనా వ్రాయవచ్చు ఏది వ్రాసినను తనకు అన్వయించని రీతిగా నుండును.

ఇక నావిషయము కొద్దిగా తెలిపెదను. నా పితామహుడు కొండారెడ్డి. పితామహి సిద్దమ్మ. పిత రామరెడ్డి చిన్నవీరారెడ్డి, మాత రామరెడ్డి చిన్నగంగమ్మ నా ఊరు నల్లచెఱువుపల్లె ప్రాథమిక విద్య స్వగ్రామములో జరిగినది. తరువాత శ్రీ చిద్ఘనానంద స్వాములవారి సన్నిధిలోను శ్రీమళయాలస్వాములవారి ఆశ్రమము లోను హిందీ. సంస్కృతము అభ్యసించితిని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలయందు (విద్వాన్ A) చదివి మదరాసు విశ్వ విద్యాలయమునుండి విద్వాన్ పట్టమును పొందితిని. 1954 వ సంవత్సరమున మొదట సిద్ధవటమునందు తెలుగుపండితుడనుగా చేరి 1991 వ సంవత్సరమున ఒబుళవారిపల్లెలో ఉద్యోగవిరమణ చేసి ఉన్నాను సిద్ధవటము, పులివెందుల. నల్లచెఱువుపల్లె, అగడూరు, ఆకేపాడు, ఓబులవారిపల్లెలందు ఆంధ్రోపాధ్యాయు డనుగా పనిచేసితిని

నల్లచెఱువుపల్లెను గూర్చి తెలుపవలసిన విషయములు కొన్నిగలవు. కడపమండలము పులివెందులతాలూకాలో మోపూరు అను గ్రామముండెను. అది ఇప్పుడు శిథిలమైపోయినది. గుర్తుకు పాతగోడలు గలవు. ఈ మోపూరు మోహనశైలము, మోహనగిరి, మోపూరుతిప్ప అనుపేర్లుగల కొండపైనున్నది. దానిని వినుకొండ వల్లభరాయడు అనునతడు పాలించుచుండెను. ఇది ములికినాటి లోనిది. పూర్వము వెలనాడు, పలనాడు. వేగినాడు, ములికినాడు అను ప్రాంతములుండినవి. క్రీడాభిరామమను గ్రంథమును వ్రాసి నది ఈ వినుకొండ వల్లభరాయుడనుటకు కొన్ని నిదర్శనములు గలవు. ఈ గ్రంథములోని కృతికర్తృ ప్రశంస చదివినచో నతని వంశక్రమము తెలియును.

సీ॥ ఘూడు గ్రామ గ్రాసములతోడ నూతంగ
మోపూరు పాలించె ముల్కినాట
అశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగా బఠించె
ప్రత్యక్షమొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వత శ్రీవరించె
కామకాయనస విశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
ఎవ్వఁడా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్న భండార రక్షకునకు
ప్రియతనూజుండు చంద్రమాంబికకు సుతుడు
మమజ మాత్రుండె వల్లభామాత్యవరుడు

అని తన వంశక్రమమును తెలుపుచు అతనికిగల వాగ్వైభవమునుగూర్చి చాటుకవితా పాటవము గలదనియు, నల్లచెఱువు తూమువలె కవితాధారగలదనియు చెప్పుకొన్నాడు. (నల్లచెఱువు తూమునకుబదులు నెల్లూరుతూము అని సవరించినట్లు తోచును)

భైరవునిగూర్చి వ్రాసినపద్యము వల్లభరాయునివీధినాటకము లోనిదని పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరములో నుదహరించిన పద్యమును చూడుడు.

సీ॥ చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
విమలదంష్ట్రా ప్రరోహములవానిఁ
పవడంపుకొనలతో ప్రతివచ్చుననవచ్చు
కమనీయతర దేహకాంతివాని

ఇంద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
కుటిలకోమల జటాచ్ఛటలవాని
ఉడురాజరుచులతో నొఱవచ్చుననవచ్చు
చంచన్మహాట్టహాసములవాని

గీ॥ సిగ్గుమాలిన మొలవాని(జిఱుతవాని
ఎల్లకాలము ములికి నాడేలువాని
అద్దిమోపూర నవతారమైనవాని
భైరవునిగొల్వ వచ్చిరి భక్తవరులు

ఆ భైరవుని విగ్రహము చాలా ఎత్తు, లావు, ఉన్నందున వస్త్రములతో అలంకరించుటకు వీలుకాదు. కాన సిగ్గుమాలిన మొలవాడు అనవలసివచ్చినది, శంభునిపట్టి అని చెప్పినందున చిఱుతవాడు అనవచ్చును. ములికినాట ఉన్నందున ఎల్లకాలము ములికినాడేలువాడు అనవచ్చును ఈ క్రింది పద్యమును చూడుడు

చ॥ ముదమున ముల్కినాటిపుర మోహనశైల సువర్ణకందరా
పదస్థుడు కాలభైరవుడు శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ గృపసేయు(గవీంద్రకాంక్షిత
త్రిదశ మహీరుహంబునకు(దిప్పయవల్లభరాయ మంత్రికిన్

ఈవల్లభరాయుడు కవిత్వము వ్రాయు సమర్థుడననియు నన్నయ. తిక్కన భాస్కరులతో సమాడనని స్వయముచెప్పు కొన్నాడు ఈమోపూరునందు కవులు, గాయకులు కళాకారులు ఉండిరనుటకుకూడ ఈపద్యముదాహరణము

క॥ నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిదివినుకొండ మహా
పుటభేదనమీ త్రిత్రయము
నిటగూర్చెను బ్రహ్మరసిలెల్లను మెచ్చన్

అను పద్యమువలన తెలియుచున్నది. మఱికొన్ని దాన శాసనముల వలనకూడ ఆశేషదేవవిద్వజ్జనములున్నట్లు తెలియు చున్నది 12, 13, 14, 15 శతాబ్దములో వ్రాయించిన దానశాసన ములు గలవు. ఈప్రాంతమును ఇచ్చటిశాసనములను చూడకయే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామము శ్రీనాథ విరచితమని నిరూపించుటకు ప్రయాసపడిరి. బండారు తమ్మయ్యగారు క్రీడాభి రామమును రచించినది వల్లభరాయుడని సోపపత్తికముగా నిరూ పించెను. ఇట్టివిమర్శలు చేయువారే మున్ముందు నాపుస్తకము విషయమునగూడ రాయరెడ్డి వేరని ఎల్లారెడ్డి వేరని చేయుదురని ముందుగా చెప్పితిని. మూడుగ్రామగ్రాసములతోడ మోపూరు పాలించె ములికినాట అన్నట్లు మోపూరులేకున్నను ఈ మూడు గ్రామములు ఇప్పటికినిగలవు. అవియే నల్లచెఱువుపల్లె, కొండ్రెడ్డి పల్లె, నారేపల్లె అను పేర్లతో నున్నవి. ఈ పల్లెల పొలిమేరలలో భైరవుని మాన్యములు యిప్పటికిని గలవు.

శాలిశక 1272 నందన సంవత్సరమున శ్రీ సావంణ యొడ యలు మోపూరుభైరవుని అంగరంగ వైభోగాలకు పులివెందుల భూమిలో సాగునందున్న ముల్కినాటిభూమిలో ౨ మడిన్ని దానముచేసినట్లు కలదు.

శా, శ. 1347 వ శతాబ్దమునకు కుమారదేవరాయలు విజయనగరమును పాలించుచుండగా బొప్పదేవుని విరూపణ్ణం గారి కుమారుడు తిరుమలరాయునింగారు మొదటి గోపురమును కట్టించినట్లు శా, శ. 1452 న అచ్యుతరాయలు కాలమున 1466 సదాశివరాయల కాలమున చేసిన దానశాసనములుగలవు.

ఆ శాసనములు అస్పష్టముగానున్నను. నాకు తెలిసినంత వరకు ఈ క్రింద పొందుపరచుచున్నాను.

1. పులివెందుల భూమిలో మడిదానమును చేసినశాపము

స్వస్తిశ్రీ జయాభ్యుదయశక వరుషంబులు ౧౨౭౨ నందన సంవత్సర చైత్ర......స్వస్తిశ్రీ మంమహామండలేశ్వర హరిరాయ విభాసగి తిప్పవరాయరగండ పూర్వసముద్రాధిపతి వీరశ్రీసావంణ యొుడయలు ఉదయగిరి సింహాసనమున రాజ్యముచేయుచుండగా మాతంౡడి తిప్పవరానుజుకుంను తమ........తమ అమ్మగారికిన్ని పుణ్యముగాను మోపూరు భైరవేశ్వర అంగరంగ భోగాలకు పులి వెందుల భూమిలోను సాగునందుంవ్న ముల్కినాడి భూమిలోను చెరువుక్రింద ౨మడింన్ని దారాపూర్వకముగా అచంద్రార్కస్థాయి గాను యిచ్చెను. ఇదంమానమునకు యవ్వరు విఘ్నము సేసినాను గంగకరుత ఆవులపొడచిన పాపానపోయిన వారగుదురు.

2. దేవాలయమునకు పశ్చిమముననున్న సింహద్వారముపై గోపురము కట్టిన శాసనము:

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక ౧౩౪౭ అగు విశ్వావసు సంవత్సర అశ్వీజ బహుళ ౮ అష్టమి

స్వస్తిశ్రీమత్ రాజాధిరాజ రాజపరమేశ్వర అరియరాయ విభాగభాసగి తిప్పవరాయరగండ హిందూరాయ సురత్రాణు పూర్వపశ్చిమ దక్షిణోత్తర చతుస్సముద్రాధీశ్వరుండు వీర విజయ బుక్కరాయ మహారాయల గర్భరత్నాకర దరమచారిత్ర్యనిత్యగా భోజవిశ్వకాత్యాయణ సత్యహరిశ్చంద్ర ఉదయ బాలభాస్కరుం డైన శ్రీమన్మమహామండలేశ్వర శ్రీ వీరప్రతాప కుమార దేవరాయ మహారాయరు విజయనగర పట్టణమునందు సుఖసంగతా వినో దంబున రాజ్యముచేయుచుండగాను. అదేవరాయ మహారాయల నిజభృత్యుండైన స్వస్తిశ్రీ మదుద్దండరగోగి గజసింహమై కవితా మండలి గండ బిరుతాంకితులైన బొప్పదేవుని విరూపణ్ణంగారి కుమారుండు తిరుమలరాయనింగారు తమతల్లులు తిమ్మాయం మంగారికిని, నాగాయంమంగారికిని తమతక్కగాను తిరుమల్ దేవమ్మగారికిని పుణ్యముగాను మోపూరు భైరవదేవర సన్నిధిని పశ్చిమ భాగమందు తమ బందువముల తిబ్బనాయనిచేతను ఆచంద్రార్కస్థాయిగాను కట్టించిన గోపురము.

### 3. అచ్యుత రాయల కాలమున చేసిన దాన శాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౫౨ 1452 అగునేటి వికృతి సంవత్సర వైశాఖ శు 3 శ్రీ మద్రాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప వీర అచ్యుతరాయ మహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢుడై పృథ్వీ సామ్రాజ్యంబేలుచుండగాను ఘండికోట సీమలోని మోపూరు భైర వేశ్వరునికి, భారద్వాజ గోత్రం అశ్వలాయన సూత్రం రుక్కు శాఖాధ్యాయులయిన రాయసంకొండ మరుసయ్యగారి కుమారుం డైన అయ్యపరుసుగారు యిచ్చిన దానశాస్త్ర క్రమమెట్లంనను

స్వామిమానాయంకురానకు పాలించనవధరించిన ఘండికోట ఘండికోట ధుర్గానకు చెల్లే మోపూరు బయిరవేశ్వరునికి చతుగ్రామాలను యెండంగికి దుర్గానకు అచటి దుర్గదన్నాయని పర్తనలువర ౨౩౫అక్షరాను యింస్ఫూటముపైఅయిదు వరహాలను మోపూరి భైరవేశ్వరునికి వైశాఖ శుద్ధ మొలకల పుంన్నమ రథమహోత్సవానకు దేవుని అంగరంగ వైభవాలకును మాస్వామి అచ్యుత రాయలకు పుణ్యంగాను తథాతిథి తదియ పుణ్యకాలమందు సిద్ధవటం జ్యోతిసిద్ధేశ్వరుని సన్నిధిని సహిరంన్యోదక దానధారా పూర్వకంబుగాను త్రివాచికముగాను, త్రికరణశుద్ధిగాను ధారవోసి యిస్తిమి. అచంద్రార్కస్థాయిగాను చెల్లిరావలెనని యిచ్చిన ధర్మశాసనముగ ఈధర్మానకు యెవ్వరు విఘ్నముచేసినాను వారణాసిలోను గ్రోబ్రాంహణుల వధించిన ధోషానంబోయినవారు గంగలోవలను కపిలధేనువును చంపిన పాపానబోయినవారు,

స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం
పరదత్తాపహరణం యత్స్వాత్ స్వదత్తం నిష్ఫలంభవేత్

**4. సదాశివరాయల కాలమున చేసిన దానశాసనము.**

శుభమస్తు స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౬ 1466 అగు నిజ క్రోధిసంవత్సర మాఘ శు ౩ సోమవారము శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీరసదాశివ దేవ మహారాయరు విజయనగర పట్టణమందున్ను రత్నసింహాసనారూఢులుండై పృథివి సామ్రాజ్యము చేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర అత్రేయ గోత్రం సోమవంశోద్భవులైన నంద్యాల అవుచదేవ మహారాజ పౌత్రులైన నరసింగయ దేవమహా

రాజ పుత్రులైన శ్రీ తిమ్మయదేవ మహారాజులుగారు ఘండికోట సీమలోని దేవస్థానాలు అగ్రహారాలు అందలి నానాగోత్ర........ సూత్ర నానాశాఖాధ్యాయ పవిత్రులైన అశేషదేవ విద్వన్మహాజనాలకు యిచ్చిన సర్వమాన్య ధర్మశాసనక్రమ మెట్లంనను సదాశివదేవమహారాయరు మాకునాయంకరానకు పాలించిన ఘండికోట సకలసీమలోని దేవతాగ్రామాలు అగ్రహారాలనుంను. పూర్వాన ఘండికోటకు అచటి దుర్గవర్తన దణ్ణాయని వర్తన బిడిగెకాణికకోటలు మొదలైనవియంనిగలవు. అంనింనియథాథితి రథసప్తమి పుణ్యకాలిమందు పినాకినీనదీతీరమందు లోకపావన శ్రీ నృసింహదేవుని సన్నిధిని శ్రీమదహోబల నృసింహ్వాబృతిగాను. సర్వమాన్యంగాను పేస్తిమి. గాన మీపుత్రపౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను క్రత్వాది అనుష్టానాలు చేసుకొని సుఖాన ఉండేది. యీమర్యాదన మోపూరు భైరవేశ్వరుని నిత్యధూప దీప నైవేద్య అంగరంగ వైభవాలు రథమహొత్సవము మొదలైన మహొత్సవాలకు భైరవేశ్వరునికి చేరుగ్రామాలను అచటి దుర్గదళోయనివర్తిని బెండిగిణికి కోటలు మొదలైనవి యుంనిగలవు. అంనింని ఈతథాతిథి పుణ్యకాలమందు సహిణ్యోదక దానదారా పూర్వకంగాను సర్వమాన్యంగాను దారవేసి యిచ్చిన ధర్మశాసనం ఇదర్మాశకు ఎవరు ఏవిధమైనను విఘ్నంజేసిన గోబ్రాంహణుని వధించిన పాపానపోవువారు. (స్వదత్తా ద్విగుణం పుణ్యం)

శాంకము ౧౫౩౧ నందన నామసంవత్సరమున మాఘ బహుళ ౭ సప్తమిన మోపూరు భైరవుని దేవాలయ ముఖమండపము బొగలదేవి బ్రహ్మదేవుని మనుమడు కట్టించినట్లు గలదు. పైశాసనములలో లిపి నాకుతెలిసినంత వ్రాసితిని. శాసనలిపి నెరిగినవారు వ్రాసినచో పూర్తివివరము తెలియును. ఈదేవాలయ

మునకు మాన్యముగా యిచ్చిన మూడుగ్రామాలను పాలించిన రాయనవరరత్న భండారరక్షకుడు వల్లభామాత్యుడు క్రీడాభి రామమును వ్రాసినట్లు తెలియుచున్నది. రెడ్డిరాజుల ఆస్థానమున దండనాథాది పదముల నధిష్ఠించి వినుగొండ యందుండినందున వీరికి వినుగొండ అను యింటిపేరు వచ్చిఉండును. వినుగొండ యందు సైనికులుగా ఉండి విక్రమము చూపినవారో మరి ఎవ రెవరో కొందరు వీరుల విగ్రహములు అచట వరుసగా ఉన్నవి. పోతయవీరుడు, బయన్నవీరుడు, క్షత్రియవీరుడు భైరవదేవర మణి మొదలగు పేర్లుగలవారి విగ్రహములు గలవు.

సందర్భవశాత్ మాదేవుని(భైరవుని)గూర్చి వ్రాసినకవితలోని విషయములను వివరించెదను.

ఈదేవాలయము ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమకు నడుమ గల కడపమండములోని పులివెందులతాలూకా నల్లచెఱువుపల్లెకు సమీపమున గలదు. మోహనగిరిపై మోపూరు అనుఊరువుండెను అచట దాదాపు 80 సంవత్సరములకు పూర్వము పూజారులు. జోగులు పండితులు ఉండెడివారు. వారంత జీవనము గడువక వదలిపోయిరి. వారినే యిప్పటికిగూడ కొండమీది పూజారులని, మోపూరు జోగులని కూడ పిలుచుచున్నారు. మోపూరు పేరుగల వారు ఈనాటికి నల్లచెఱువుపల్లెలో బ్రాహ్మణులు, తలారులు, (భైరవుని ఊరేగింపుచేయువారు) మంగలివారు. మాదిగవారు ఉన్నారు.

ఈ మోపూరుకొండకు దగ్గఱ ఒకఏరు కొండలనీరు పారు నది. సింహాద్రిపురము పరిసరములనుండి ప్రవహించుయేరు.

ముఖమాల. (మొగమూరు) పులివెందుల ప్రాంతమునుండి ప్రవహించునది ఉద్దండవాగు. మూడునదులు త్రివేణిసంగమము జరుగును. ఆనదులు సంగమేశ్వరమువద్ద గండినది పాపాఘ్నితో కలియును. ఈ మోహనగిరి నడుమ దాదాపు 15 అడుగుల ఎత్తు 12 అడుగుల చుట్టుకొలతగల పెద్ద నిలువరాయి ఉండెను. దాని చుట్టు నల్లగుండ్లు లెక్కకుమించి ఉండెను. ఆనల్లబండ రాళ్ళను శ్రావణములతో చీల్చి గుడులు ప్రాకారములు కట్టించిరి. చీల్చిన గుండ్లు, చీల్చుటకు రాళ్లకువేసిన రంధ్రములు ఇప్పుడుగూడా చూడవచ్చును.

లింగాకారముగా ఎత్తుగాఉన్న గుండుకు చుట్టు దేవాలయ మును కట్టిరి. కాని ఒకే అంతస్తులో అంతలింగము నిమిడ్చలేకనో రాతితో అంతఎత్తుకట్టుటకువీలులేకనో రెండుఅంతస్తులుకట్టించిరి. మొదటి అంతస్తులో దేవునినడుమువరకు చూడవచ్చును. రెండవ అంతస్తులో పైభాగమును చూడవచ్చును. తలపైన అభిషేకము, క్రింద పూజచేయుచుందురు. పూర్తి విగ్రహమును చూడవలెనన్న క్రిందపైన చూచినగాని పూర్తి దైవదర్శనము కాదు.

దేవాలయ నిర్మాణకాలమును నిర్ణయించుటకు ఆధార ములు లేకున్నను. మానవనిర్మిత విగ్రహముగాదు గాన భూమి పుట్టినపుడు పుట్టినదేవుడే గాన మిక్కిలి ప్రాచీనమైనదిగా చెప్ప వచ్చును. 12వ శతాబ్దమునుండి శాసనములున్నందున అంతకు ముందు నిర్మింపబడినదని మాత్రము చెప్పవచ్చును ఈశాసన ములు ముందుగా చూచిఉన్నారుకదా!

ఇచట అన్నిమతములకు ఆచారములకు సంబంధించిన విగ్రహములుగలవు. ముఖ్యముగా శైవ, వైష్ణవ, శాక్తేయమతము

లకు సంబంధించిన విగ్రహములుగలవు. భైరవగుడి వెనుకభాగ మున శివ కేశవుల మందిరములుకలవు. ఆమందిరములలో లక్ష్మి పార్వతుల విగ్రహములు వినాయకవిగ్రహము ఎదురుగానంది విగ్రహముగలదు. గుడిముందుభాగమున కొంతదూరములో కుడి ప్రక్క కుమారస్వామి విగ్రహము దుర్గాదేవి (మహిషాసురమర్దిని) విగ్రహము గలదు. ఎదురుగా బౌద్ధారామము అమరావతి స్థూపా కారమున గూడుఆకారముతో ఉండినది. (ఇప్పుడది పడిపోయినది దానిని కొంతమంది విభూతిగుహ అనికూడ అందురు. బౌద్ధావ శేషములను అచ్చటబూడ్చి ఉండినను ఉండవచ్చును.

ఇచ్చటి గుహలో భస్మాసురుడు విభూతిపూసుకొని తపస్సు చేసి ఉండునని కూడ మనము ఊహింపవచ్చును. ఈశ్వరుని ప్రత్యక్షము చేసుకొని తలపై చేయిపెట్టిన చచ్చెడువరమును పొంది శివునిపైననే ప్రయోగింపబూనగా శివుడుమాయమయ్యె ననియు ఆలింగముపై పెట్టగానది పగిలినదనియు చెప్పుచుండురు లింగముపై యిప్పటికిని చేతిగుర్తు వేలిగుర్తులు ఉన్నవి. తరువాత అచ్చటనే ఉన్నవిష్ణువు మోహినియై శివునికి సాయముచేసెనందురు క్రిందినీటిలో బూడిదను కడుగొనిరమ్మని మోహినిచెప్పగా భస్మా సురుడు స్నానముచేయుచు తనతలపై తానే చేయిపెట్టుకొని మరణించెననికథ కలదుగదా? ఆకథ ఇచ్చటనే జరిగియుండ వచ్చును. లేనిచో మోహినిగిరి మహానశైలమని పేరు ఎందులకు వచ్చి ఉండుననితోచును.

అప్పుడు శివుడు మోహినిని ప్రేమింపగా కాలభైరవుడు అక్క పప్పూరమ్మ పుట్టినారట. అయ్యప్పకూడ యిట్లుపుట్టిన వారనేకదా ఐతిహ్యము ? ఈకాలభైరవుడు దినదినము పెరుగు

చుండగా నీకుగుడి ఎవ్వరుకట్టెదరు. ఇకపెరగవద్దని పప్పూరమ్మ భైరవుని నెత్తిన చేయిపెట్టినదనికూడ కథచెప్పెదురు. మొత్తము మీదయిప్పుడుగూడ ఈ ప్రాంతమువారికి భస్మాసురుని తత్వము పోలేదనిపించును. ఈ పౌరాణికగాథలకంటే చారిత్రికాధారములు గూడ ఉన్నందున ఒకప్పుడు వైభవముగా వుండిన ప్రాంతమని చెప్పకతప్పదు. కాలక్రమమున మార్పువచ్చినను మఠముల ఆశ్రమములు, పాఠశాల అచ్చట నిర్మింపబడినవి. ఐనను అభివృద్ధికి నోచుకొనలేదు. వాటికి క్షీణదశ సంభవించినదేమో? ఈ ప్రాంతమున యోగులు సిద్ధులు ఉండెడివారనియు ఆయోగులు జోగులుగామారి ఉండిరనియు వారికొకపీఠము. తిరుమలపై మహంతు మఠమువలె మఠముగూడ ఉండెడిదనియు తెలియుచున్నది. ఈ జోగులు ఆకొండమీద కూడినపుడు విక్రమార్కుని సింహాసనము వలె మంచిబుద్ధిగలిగి దానిని అభివృద్ధిచేయవలయునని ఏమేమో అనుకొని ఎవరిదారినవారు పోయెడివారట. అందులకే ఇప్పుడు కూడ ఆప్రాంతమున "మోపూరు జోగులవాటము" అను సామెత గలదు. ఏమైనను ఈజోగులు కొంతఅభివృద్ధిచేసి ఉండవచ్చును ఆప్రాంతమున రుద్రమాంబ దర్శించినట్లు సంగమేశ్వరమున జ్యోతిర్లింగేశ్వరమున శాసనములుండినవని చెప్పెదురు. ములికినాడు పూర్వము తెలంగానమున కొన్ని జిల్లాలకు పేరుండెడిదని చదివినట్లు జ్ఞాపకమున్నది.

అచ్చటిప్రాకారములు ఒకేసారికట్టినవికావు. ప్రాకారములు గోపురములు యజ్ఞశాలలు, కళ్యాణమంటపములు కట్టించినవారి విగ్రహములు భార్య భర్తలు కలిసియున్నవికూడ గలవు.

ఈదేవాలయమునకు ఆంధ్ర. కర్నాటక రాష్ట్రములలో ఇనాముగా యిచ్చినభూములు పందలఎకరాలుకలవు. అవన్నియు

అన్యాక్రాంతమై దానిలోని ఆదాయమును అనుభవించుచున్నారు.
పూజారులకు జీతములులేక మాన్యములులేక నిత్యపూజ చేయు
వారుకూడ వదలుకొనిపోవుచున్నారు. ప్రజాదరణ ప్రభుత్వాదరణ
లేక గదులు గోపురములు పడిపోవుచున్నవి. శిల్పసంపద ధ్వంస
మై పోవుచున్నది. ఇంత పెద్దదేవాలయమును ప్రభుత్వమువారు
గుర్తించలేదు. కనీసము "కడపజిల్లా దేవాలయములు. అను
రేడియో ప్రసంగములోకూడ దీనినిగూర్చి చెప్పలేదు. అందులకే
నాకు కలిగినబాధను వెలిబుచ్చితిని. కనీసము మున్ముందు
ఎవరైన తెలుసుకొనుటకైనా వీలుండునని ఇంతవివరముగా
వ్రాసిఉన్నాను. దేవునిపై హిందూమతముపై విశ్వాసములేకున్నను
ప్రాచీన కళాఖండములను సంరక్షించు బాధ్యత ఐనా ప్రభుత్వము
వహింపవలెను. దీనిని ప్రాచీనకళాఖండములను రక్షించుదృష్టితో
ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు వారైన శ్రద్ధతీసుకొనవలెనని కోరు
చున్నాను.

నాగాయములను గూర్చి కొంతచెప్పవలెను:-

నేను తెలుగులో పద్యములను చదివి తొలుత ఆనందించెడి
వాడను. కొంత పద్యరచన చేసితిని. కాని సంస్కృతములో లేని
యతి ప్రాసలు తెలుగున ఎందులకు వచ్చినవని ఆలోచించెడి
వాడను. ఛందస్సు యతులభేదములు జూడగా సాధ్యమైనంత
వరకు అన్ని అక్షరములకు యతిచెల్లుచున్నది. ఇక ఈ నియమ
మెందుకను భావముగలిగినది. 'యతిర్విచ్ఛేద సంజ్ఞకః' అని
సంస్కృతములో నిలుపుదలను సూచించును. కాని తెలుగులో
అట్లుగాదు. ప్రాస ఒకే అక్షరము. యతిస్థానమున సామ్యమున్న
అక్షరము స్వరమైత్రిగలిగి ఉండవలయుననియుగలదు. ఆ యతి

ప్రాసలకై మహాపురుషులు కూడ అనవసరము అర్థములేని పద ములను యతిప్రాస స్థానమునవేయుటకు పడినపాట్లు స్పష్టముగ కనుపించును. అందుచే నేను యతిప్రాసల పాటించు పద్యముల జోలికిపోక గేయకవితతీసుకొంటిని ఐనను మాత్రాఛందస్సుకలదు గేయరచన చేసినతరువాత 6,7 8.9,10.12 మాత్రలు కలవిగా కొన్ని తెలుసుకొంటిని, అచ్చటచ్చట మంజరీ ద్విపద, సీసమాలిక గణములుకూడ పడినవి. అనుప్రాస వర్ణ, వృత్తి, భేదములతో పడినది. అంత్యానుప్రాస, ప్రాసయతి బాగుగా ఉపయోగించినాను నాకు కలిగినబాధను సంఘములో కనుపించు దొసగులను వెలి బుచ్చితిని. అటుప్రాచీనకవిత (యతిప్రాసయుక్త పద్యకవిత) ఇటు నవీనకవిత (యతిప్రాసలు లేని గద్యకవిత) కాకమధ్యే మార్గమున నడచిన కవితఇది ఆయాకాలములోనున్న లోపములు కొన్ని తరువాతి కాలములో తొలగెనవి. కొన్నిసమస్యలు ఈనాటికి తీరలేదు. ఉదాహరణకు రాయలసీమ నీటిసమస్య, సంఘము లోని అవినీతి లంచము, వరకట్నము మొదలగునవి, అవితీరు ఉపాయముగూడ గోచరింపలేదు. అందుచే శబ్దరూపము గలిగించి పదిమందికి వినిపించిన బాగుండుననితోచినది. ఇందులో నేనెంత కృతకృత్యుడనైనని పాఠకులు నిర్ణయింతురుగదా!

ఏదైన ఒక క్రొత్తమార్గము మొదట అనాదరణ, నిందపాల గును. వేదములు, పురాణములు, ఉపనిషత్తులు స్మృతులు, ప్రచారమునందున్న కాలములో కావ్యములను నాటకములను వ్రాయుచు కాళిదాస భవభూతులుకూడ అనాదరణపొందినట్లు వారి శ్లోకములవలన బోధపడును,

"పురాణమిత్యేవన సాధుసర్వంనచాపి కావ్యం నవమిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే మూఢఃపరః ప్రత్యయనేయబుద్ధిః

పాతదిపవిత్రమైనది క్రొత్తది అపవిత్రమైనది అనితలంపక సత్పురు
షులు మంచి చెడ్డతెలుసుకొని ఆదరానాదరములు జేతురు.
మూర్ఖులు ఇతరుల బుద్ధిప్రకారము నడుచుకొందురని తనబాధను
వెలిబుచ్చెను భవభూతికూడ.

ఏనామకేచిదిహన ప్రథయంత్యవజ్ఞాం జానంతితేకిమపి
తాన్ప్రతినైషయత్నః
ఉత్పత్స్యతే మమతుకోపి సమానధర్మా, కాలోహ్యయం
నిరవధిర్విపులాచ పృథ్వీ

నన్ను ఎవరు తేలికగా చూచెదరో వారు గొప్పవారు కావచ్చును
కాని వారికొఱకు నేను వ్రాయలేదు. అనంతకాలములో అవధి
లేని భూమిలో ఎప్పుడో ఒకప్పుడు ఎవ్వరో ఒకరు నాసాటివారు పుట్ట
వచ్చెదరు అని వాపోయెను. కాని కొంతమంది కాళిదాస భవ
భూతులు గర్వతో చెప్పిరందురు. ఎవరెట్లు భావించినను భావింప
వచ్చును "విగతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేగదా"
అనుసామెత ఉన్నది కదా! అటు ప్రాచీనము అర్వాచీనముగాక
మధ్యేమార్గమున నడచిన నాగోయములు ఇరువురినేరదకో పాత్ర
ములు కావచ్చును, అందుచే ఎవరి అభిప్రాయమును కోరలేదు.
ప్రకటించిన తరువాత చదివిన పాఠకులు వెలిబుచ్చిన అభి
ప్రాయమే నాకు శిరోధార్యము. సదభిప్రాయముగాని దురభి
ప్రాయముగాని ఏ అభిప్రాయముకైనా స్వీకరింపగలవాడను.
నేను వ్రాసినభావాలు కొంతవరకు నూతనాయకమని నమ్ము
చున్నాను, ఇది కొంతమందికి రుచించినను సుభాషితస్య మాధుర్యం
ంకరో లేత్తిమానవా?" సంఘములో వివిధభావాలను తెలుపునపుడు
నా భావములు కొందరిని బాధింపవచ్చును. నాకు ఎవరిని
ందింపవలెననిగాని, బాధింపవలెననిగాని ఉద్దేశములేదు. ఆద

రించినను ఆదరించక పోయినను నాకుబాధలేదు. శతకవాఙ్మయ
మును తొలుత నీతిశతకముగా వ్రాయుచు భర్తృహరి తనబాధను
కూడ వెలిబుచ్చెనుకదా?

బోద్ధారోమత్సర గ్రస్తాః ప్రభవస్మయదూషితాః
అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితం.

నేను వ్రాసిన నీతిశతకమును అర్థముచేసుకొనగలవారు
అసూయతోవినరు. అజ్ఞానులు అర్థముచేసుకొనలేరు. గాన వారికి
ఉపయోగపడదు. నాసుభాషితములు నాలోనే జీర్ణమైపోవును
అన్నాడు. వేమన నీతిపద్యములను మాత్రము ఎవరుఆదరించిరి.
ఆంగ్లేయుడు తెలుగుజదువుకొని దానిలోని గొప్పతనము గమనించి
ఆంగ్లభాషలోనికి మార్చినపుడుగాని మనవారికర్థము కాలేదు. నా
భావములకు ఆధారములు కొన్నిసూక్తులు. సుభాషితములు,
ఉపనిషత్తులలోను గీతలోను సంస్కృతభాషలోను కలవు, భారత
భాగవతములలోను కావ్యములలోను కలవు. అవి పఠించి
పరికించినచో పాఠకులకు గోచరించును.

ఇంకను కొన్ని గేయములుగలవు. దీని ఆదరానాదరముల
ననుసరించి ప్రచురింపదలచితిని. నాపుస్తకమువలన ఎవరికైన
ఏవిధమైన బాధకలిగినను కావలయుననిగాని వారినుద్దేశించి
వ్రాసినవికాదు. గాన దయయుంచి క్షమింపకోరెదను.

గమనిక : తొలిపలుకులలోని దోషములను వ్రాయక మునుపే
తప్పొప్పులపట్టిక తయారైనందున కొన్ని ముద్రణా
దోషములను సవరించలేదు పాఠకులు గమనింప
గలరని తలంచెదను,

ఇట్లు
రాయరె

శ్రీరస్తు  శుభమస్తు

మా ప్రియతమ ప్రధానాంధ్రోపాధ్యాయుడు

## సర్వశ్రీ రామిరెడ్డి ఎల్లారెడ్డిగారు

ఉద్యోగవిరమణచేయు సమయమున సమర్పించు

## —: పద్యసుమాంజలులు :—

రచన ; విద్వాన్ **A. నరసయ్య, M. A.,**
తెలుగు పండిట్

౧॥ నిరుపమ శాంతభావమును, నిర్మల చిత్తము, ధర్మబుద్ధియున్
గరువములేని ప్రజ్ఞ, ఉపకారముజేసెడి నీతివృత్తియున్
నిరతము తత్వచింతనము, నిశ్చలభావము, దైవభక్తియున్
పరుసములేని వాక్కుగల పండితవర్య! నమస్సుమాంజలుల్

౨॥ బహుప్రజ్ఞానిధి సంస్కృతాంధ్రముల, సద్భావంబు జూపించు ని
మ్మహిసర్వార్యజనావళియందు, చిరప్రేమన్ పెంచు విద్యార్థులం
ది, హసాఖ్యంబుల గొరనట్టిబుషి, సర్వేశున్ సదాతానుధా
లహరిన్ కీర్తనచేయు నౌర ! మనయల్లారెడ్డిగారెంతయున్

సీ॥ విద్యార్థి మనసును వికసింపజేయుంగ
బోధించు నుత్తమ బోధకుండు

సర్వభూతములందు సమబుద్ధిగలిగిన
సరసుండు న్యాయయుతుండు సాధుశీలి

మానవసేవయే మాధవసేవంచు
మనసారనమ్మిన మహితమూర్తి

సాత్వికాహారమే సతతము భుజియించు
సన్మార్గనిరతుడు సాత్వికుండు

గీ॥ నేడు మనపాఠశాలను విడిచిపోవ
తనదు ఉద్యోగవిరమణ దారిజూపె
మాదు నైరాశ్యభావంబు మానిపోవ
కలదె మార్గంబు వేరొండు యిలను వెదుక

తే॥ సంస్కృతాంధ్రాంగ్ల హిందీవిశారదుండు
చతురవాక్చతురానన, సరసమూర్తి
రామరెడ్డి యల్లారెడ్డి. నామధేయు
డై 'రాయరె' యను పేరనైననొప్పు

క॥ శ్రీయుత యల్లారెడ్డి కు
పాయనమ్ముగ నిచ్చు పాఠశాల సహోపా
ధ్యాయుల సన్మానము తల
పోయగ చంద్రునకు నూలుపోగగుగాదే!

గీ॥ పదవి విరమణ జేసెడి పండితార్య?
మానసిక శాంతి, సౌఖ్యము, మదినిగలిగి
ఆయురారోగ్య భాగ్యంబులతిశయిల్ల
నీప్సితార్థంబు లొనరించునీశ్వరుండు

ఇట్లు మీ శ్రేయోభిలాషులు
ప్రధానోపాధ్యాయ, సోదరోపాధ్యాయ,
ఉపాధ్యాయేతర, విద్యార్థినీ, విద్యార్థుల బృందము
జిల్లాప్రజాపరిషత్ ఉన్నతపాఠశాల ఓబిలివారిపల్లె
**24-4-91**

నాకులేని గొప్పగుణములను నాయందారోపించి. చూపిన అభిమానమునకు ప్రేమతోచేసిన సన్మానమునకు ప్రధానోపాధ్యాయులువారికి. సోదరోపాధ్యాయులకు, ఉపాధ్యాయేతరమిత్రులకు ప్రియమైన విద్యార్థినీ విద్యార్థులకు హృదయపూర్వక అభివందనములు.

మిత్రుడు
విద్వాన్ రాయరె

# సరస్వతీ స్తవము

నమో నమో శారదా ; పాహిమాం విశారదా !
సర్వలోక సంచారిణీ సకలకళా కోవిదా ! ॥నమో॥

సంస్కృతాంధ్ర కర్ణాటక ద్రవిడ వంగ ఘూర్జర
హిందీ, మహారాష్ట్ర ఓఢ్ర, పంజాబీ, కేరళా,
పారశీక, ప్రాకృతాంగ్ల, చీనీ, అరబీ, ఉర్దూ.
రషియా, జర్మన్, లాటిన్. అమెరికన్, రుమేనియా,
ద్యనేక వచోరూపిణీ ! ఏకభావ భాషిణీ
బహుభాషా భాషిణీ బహురూపా శోభిని ॥నమో॥

వేదోపనిషత్పురాణ కావ్యనాటకాది దేహా
ఛందోలంకారయుక్త గద్యపద్య గేయవసనా
నృత్యనాట్య లలితకళా భూషణా విభూషితా
సద్గుణ సంవర్ధినీ, దుర్గుణ సంహారిణీ ॥నమో॥

సర్వదేశవాసి బాలబాలికా వికాసినీ
సకలలోక విద్యాలయ ఛాత్రకాంక్షదాయినీ
సురూపిణీ ! సుశోభినీ ! సుభాషిణీ ! సుహాసినీ !
శుభదా ! సుఖదా ! వరదా ! వీణాపాణీ ! వాణీ! ॥నమో॥

# వేంకటేశ్వర ప్రార్థన

శ్రీ శ్రీనివాసా ! శ్రీ వేంకటేశా !
పాహి గోవిందా ! పాహి ముకుందా ! ॥శ్రీ॥

శ్రితజన మందార శ్రితపారిజాతా
ఆశ్రితపావనా ఆపన్నివారనా ! ॥శ్రీ॥

మణిమయమండిత మంజులభూషణ
కనకాభరణా కాంచన గోపుర ॥శ్రీ॥

వెంకటరమణా సంకటహరణా
సరసిజనయనా సారసవదనా ॥శ్రీ॥

శ్రీవేంకటాచల శిఖరాగ్రవాసి
శేషాచలపతి శేషాశయనా ॥శ్రీ॥

బృందారకజన వందిత మందిర
చందన చర్చిత సుందర విగ్రహ ॥శ్రీ॥

కమలాకాముక కమలానాయక
తిరుమలనాయక తిరునామశోభిత ॥శ్రీ॥

శంఖచక్రయుత శార్ఙ్గగదాధర
శింజితనూపుర రంజిత పదయుగ ॥శ్రీ॥

శ్రీవత్సాంకిత శ్రీరమారమణ
గోవిందాహరి గోవిందాహరి ॥శ్రీ॥

అయాహివిభో మాంపాహిప్రభో
హరిగోవిందా గోవిందాహరి ॥శ్రీ॥

———

# సద్గురు స్తోత్రము

ఓ మళయాల యతీంద్రా ! ఓ మహనీయమునీంద్రా !
తుంగయశోత్తీర్ణ రంగదుత్తుంగాకాశగంగ ॥ఓ॥

శుష్కవాద తమోపిహిత ముష్కర మూర్ఖాపనీత !
అనుభూతిప్రకాశకా అనుష్ఠాన వేదాంతా ! ॥ఓ॥

సంస్కృతభాషోద్ధరణకు సర్వశక్తియుక్తులతో
వ్యాసమహర్షినిబోలిన వ్యాసంగము జేసినావు ॥ఓ॥

పరమఋషీ ! పరమహంస పరివ్రాజకాచార్యా !
ఓ మళయాళమహర్షీ మహితామల బ్రహ్మర్షీ ॥ఓ॥

నిస్సంగానందవరా ! సత్సంగానందకరా !
అస్సంగానందగిరీ ! శ్రీవిమలానందగురూ ! ॥ఓ॥

కేరళదేశానపుట్టి తిరుమలగిరిపైనమెట్టి
ఏరుపేడుమలగట్టున వ్యాసాశ్రమమునగిట్టిన ॥ఓ॥

పురుష, స్త్రీ భేదరహిత జాతివర్ణ మతాతీత
విద్యార్థీ విద్యార్థిని విద్యాలయకులపతీ ॥ఓ॥

సద్యోసంజాతవక్త విద్యాబోధాఽవిభక్త
మహిళావిద్యానురక్త మతసార మహాప్రవక్త ॥ఓ॥

చతురాశ్రమ చతుర్వర్ణ చతుర్వర్గ చతుర్మార్గ
చతుర్బోధ, చతురానన చతురరచన చతురవచన ॥ఓ॥

భగవద్గీతార్థయుక్త భగవత్తత్వార్థవేత్త
ఉపదేశామృతబోధక అపవర్గాశయ సాధక ॥ఓ॥

గుణత్రయ గుణాతీత గురుభక్తిప్రకాశకా
సనాతనాధునాతన వేదాంతజ్ఞానసధనా ! ॥ఓ॥

విద్యావిజ్ఞానదాత ఉద్యోగభృతివిధాత
అనాథనాథ, అపరపితా అబలా జనబలప్రదాత ॥ఓ॥

అజ్ఞానతమోపహార విజ్ఞాన మనోవిహార
కుటిలభావసంహారా చటులబుద్ధిపరిహార ॥ఓ॥

ఓంకార ప్రణవనాద హుంకారధ్వని నినాద
దూరీకృత దుర్మార్గా సన్మార్గాశ్రయ దుర్గా ॥ఓ॥

నమో నమో సద్గురువర నమో నమోమద్గురువర
నమోస్తుతే నమోస్తుతే నమో నమో నమోనమః ॥ఓ॥



## అంకితము

నాలోన పుట్టింది నాలోన పెరిగింది
నన్ను ప్రేమించింది నన్ను పెనవేసింది
నాలోన లీనమై చాలా కాలంబాయె
నేనె తానైపోతి తానె నేనై పోయె.
వలచింది తనుతానె వలపింపజేసింది
మురిసింది తాతానె మురిపింపజేసింది
కవ్వించి నవ్వించి కామింపజేసింది
చిన్నారి పొన్నారి వన్నెచిన్నెల కన్నె
కమనీయ రమణీయ కన్యకవితాకన్య.
కరగించు హృదయంబు కన్నీరు గార్పించు
గళమెత్తి పాడించు ఎలుగెత్తి యేడ్పించు
మురిపించునొకసారి మరపించునొకతూరి
హాయిని జేకూర్చు ఆనందమొందించు
మాటలాడగ జేయు మౌనంబు గలిగించు
నను కట్టిపడవేయు నను కొట్టిబాధించు
తూర్పారపట్టించు దుమ్మెత్తిపోయించు
అదలించి బెదరించు గదిరించి పదరించు
నిదురింపగాచేయు నిర్నిద్రుగావించు
ద్వేషంబు గలగించు వేషంబు వేయించు
రోషంబు రేపించు మీసంబు దువ్వించు

తాను చెప్పినయట్లు నేనుచేయుచునుందు
నేను చెప్పినయట్లు తాను చేయుచునుండు
తీర్చిదిద్దినరీతి తీరుచుండునుతాను
ఏదిచెప్పిన నేను ఎదురుచెప్పదునాకు
అందాల రాణి యానందాల రాసి నా-
యారాధ్య దేవతై యావిర్భవించిన
కవితా కుమారికీ గాయు నెచ్చెలులను
చేదోడు వాదోడు సైదోడుగా జేతు
సఖియలై చెలియలై సవతులై మాతలై
చిత్రశిల్పంబులై గాత్రగానంబులై
పాత్రనృత్యంబులై ధాత్రినెల్లప్పుడు
శోత్రపేయంబులై నేత్రపర్వంబులై
వర్ధిల్లవలెనంచు వాంఛించువాడ.
సర్వ సర్వంసహా సార్వభౌమునకైన
జగముల నిర్జించు జగజట్టికైనను
సామంతులకునైన సచివాగ్రణులకైన
అర్థవంతులకైన- నధికారులకునైన
అందరట్టులనేను అంకితంబీ లేక
అచ్చువేయించమని బిచ్చమెత్తగలేక
అమ్మించమనికూడ అర్థించగాలేక
ఇన్నాల్లు నేనూరకున్నాను జనులార !
యిప్పుడార్థికమైన యిబ్బందులున్నను
స్వార్జితంబైనట్టి స్వల్పద్రవ్యంబుతో
నచ్చువేయుంచుటకు నిచ్చగించితినేను

## 6

ఎప్పుడో ఏనాడో ఎదలోని బాధలను
వెలిబుచ్చితిని కొన్ని, తొలగుచున్నవికొన్ని
కాయంబునకు గల్గు గాయాలరీతిగా
గుండెకోతకు మెండు గురియౌచు బరువైన
హృదయ వేదన నేను మదినిల్పుకొనలేక
శబ్దరూపముతోడ శబ్దగుణకంబైన
ఆకాశవీధిలో నాశావకాశాల
వెదజల్లితిని ముందు – విశ్వమంతా నిండ





7

## ఉన్నసంగతి

కవిని నేను కాదులెమ్ము కవితనాది కాదుపొమ్ము,
కావ్యాలను నాటకాల - కవనాలను కథానికల
గద్యాలను పద్యాలను చంపూలను బుర్రకథల
వ్రాయాలని వ్రాయలేదు చేయాలని చేయలేదు
గాయాలిటుతగిలెనాకు గేయాలను గీయలేదు
ఆదాయము కొరకుగాదు, ఆనందం అసలెకాదు
కావ్యంబుల కల్పనలను చదువులోని సారంబును
సారస్వత సంగతులను భాషలోని భావంబును
లోకములో పోకడలను మనుజులలో మర్మములను
ఉచ్చనీచ భావంబుల హెచ్చుతగ్గు భేదంబుల
జాతిమత విచక్షణముల లోతుపాతులన్నింటిని
తెలిసికొనుచు తలచుకొనుచు, కడుపుకాలి గుండెమండి
గాయములిటు కలిగెనాకు గేయాలను గీయలేదు
పశుహననం, పక్షిశిక్ష, ప్రాణిహాని, జంతుబలులు
అన్యాయం అధర్మాలు అవినీతులు అక్రమాలు
చిచ్చురేగి పెచ్చుపెరిగి చచ్చిపోవు సమాజమును
చూడలేక బాగుపరచు జాడలేక వేదనపడి
ఎదలోపలి ఏదోవెత వెల్లువగా పెల్లుబికెను,
కాని నేను కవినికాదు; కాదు నాది కవితసుమా !

8

## కవి

కలముపట్టి కదలించిన
కవిననుకొని గర్వించును
వచ్చిరాని పదములెల్ల
వెనుకముందువేసికొన్న
పద్యమనుచు గద్యమనుచు
అల్లిబిల్లి గల్లుకొన్న
బిఱ్ఱబిగిచి విఱ్ఱవీగు
అతనికెందుకారాటం
అంతులేని ఆర్భాటం
ప్రజలలోన రసికతేది
కవులకేది గౌరవమని
ఒళ్ళువిఱచి బల్లగ్రుద్ది
పల్వరించు ప్రగల్భించు
సన్మానం సంభావం
ప్రోత్సాహం ప్రోద్బలము
కావాలని కలవరించు
అతనికెందు కావేశం
నిర్వేదం నిశ్వాసం
తనకావ్యం ఘనకార్యం
దాని చదివి దానిని విని
ప్రజలెందరు బాగుపడిరి
ఎందరి కే యే రీతుల
నుపకరించు నుర్విలోన

అని యెందుల కనుకొనడో
స్వాంతమందు నుంతకూడ
కవివ్రాసిన కావ్యమేదొ
ఏ రీతిదొ ఏ భాషయొ
ఆ రీతిని నా భాషను
ఎరుగువారే ఎరుగగలరు
తదితరులకు తరముగాదు
దానవేమి యొనగూరును
ఎందరెంద రెట్టెట్టుల
బ్రతుకులపై భ్రాంతిలేక
శాస్త్రజ్ఞులు శక్తికొలది
శోధించుచు భేదించుచు
ప్రజలకెల్ల పనికివచ్చు
సాధనముల సాధించిరి
అవి యెంతో హాయినిచ్చు
విద్యుత్తెన్ని విధములైన
సౌకర్యము సమకూర్చును
టెలిగ్రాము టెలిఫోను
టెలిప్రింటు టెలివిజను
రైలు, బస్సు, విమానాలు
పరికరాలు పనిముట్లును
లెక్కలేని పెక్కుగల్గు
వాని నెవరు కనిపెట్టిరొ
ఏ పేరో ఏ ఊరో

ఎవరైనా ఎఱిగినార !
పిలిచినారా ? తలచినారా ?
వారిదములు వర్షించును
భూజంబులు పుష్పించును
ప్రసవంబులు పరిమళించు
కర్తవ్యము గావించును
ప్రజలనుండి ప్రతిఫలముగ
కోర్కెలేమి కోరవుగద
పరభృతముల ప్రవాళములు
బింబిరముల పద్మంబులు
రమ్మనునా పొమ్మనునా
సారమున్న సరుకైతే
సరసులైన రసికవరులు
వారంతకు వారె రారె !
నీ ధర్మము నెరవేర్చుము
పరధర్మము భావించుచు
కవులకేది గౌరవమని
బాధపడిన ఫలితమేమి
చేసిన దికచేసినావు
చేయనిదే చేయవలెను.



# కవిత

పూర్వమొక్క పూజ్యమహా
కవివరుడొక కావ్యంబును
మహారాజు మహారాణి
మనస్పర్ధ మాన్పుటకై
రాజు రాణి మోజుదీర్ప
రమ్యముగా రచియించెను
సర్వసౌఖ్య సంధాయక
సార్వభౌమ సాహిత్యఁ
ఆనాటికి నదియు సరే
రంజించును రాజునాడు
ప్రజల కొఱకు ప్రాణమిచ్చు
ఆనాడొక ఆంధ్రకవికి
నిరుపమాన పరిసరంబు
అనుపమమగు హర్మ్యంబును
ఊగ తూగుటుయ్యేలయును
ఘృతసూపోపేతంబౌ
ఇష్టమృష్ట శ్రేష్టాన్నం
పంచభక్ష పరమాన్నం
అపూపములు అప్పడాలు
ప్రేమమీర ప్రియదూతిక
తనకిచ్చెడి తాంబూలం
ఒప్పుతప్పు చెప్పజాలు
వ్రాతగాండ్రు రసికవరులు

కావాలట కవనానికి
ఆనాటికి అదిసరిలే
కూటికేమి కొఱతలేదు
కూడు గుడ్డ నీడలేక
రెక్కాడిన డొక్కాడక
సతమతమౌ సమయమిపుడు
ప్రజలు నేడు ప్రభువులైరి
ప్రజలగూర్చి వ్రాయవలయు
కష్టపడుచున్నకావ్యంబుల
చదువుకొనే సమయమేది
తీరకున్న తిలకించిన
వీలుండిన వినుచుండిన
అర్థమైన నంతెచాలు
ప్రకృతి నెపుడు వర్ణించెదు
కవిరాజులె కనిపింతురు
ఎంతసేపు వింతగొలుపు
ధరాధరం వారిధరం
వియద్గంగ విద్యుల్లత
గగనవీధి ఘనాఘనము
చందమామ చంద్రికయును
ఉషఃకిరణ ఉదయారుణ
సాంధ్యరాగ సౌందర్యం
సాగరములు సరిదంబులు
బిసకిస లయమిసిమింతలు
సరోజములు శిరీషములు

మల్లికలను మాలతులును
సంపంగులు జాజిపూలు
మందారపు సింధూరం
మకరందపు మాధుర్యం
కవివరులకు కనుపించును
లోలహరిణ లోచనములు
మయూరముల వయారములు
కీరముకిలకించితములు
కోకిల కలకూజితములు
మధుకరముల మధురవములు
చిలుక పలుక చెవిసోకును
నవయౌవన నారీమణి
నగ్నసర్మనయగారం
లలనామణి లావణ్యం
నయనానన నాసికములు
రదనంబులు వదనంబులు
మధురాధర సుధారసం
బాహుఊరు పాణిపాద
శ్రోణివేణి సుస్మితములు
ఉరోజములు శిరోజములు
జఘనంబులు జంఘంబులు
చంచల చేలాంచములు
కవివరులకు గనుపించును
వధూవర ప్రణయగాథ
విరహంబులు విహారములు

సరసంబులు విరసంబులు
పరిరంభం పరిహాసం
పేళనములు ఖేలనములు
చుంబనములు జృంభనములు
కవివరులకు గనుపించును
ఋతుశోభలు రతిసుఖములు
మలయపవన మన్మధులును
దిగంతముల దృగంతములు
కురంగముల తరంగములు
సరిత్తీరగిరిదరులును
కవివరులకు కనుపించును
ప్రకృతిలోని వికృతినెవరు
తలపనైన తలపరేల !
శుకపికముల పీకపిసుకు
కిరాతకులకి రాతకం
హరిణంబుల హతముజేసి
శశకంబుల సంహరించి
భక్షించే రాక్షసులును
ఝుంఝూనిలభంజితమౌ
మేఘమాలమెరుపుతీగ
దావానల దగ్ధమైన
కోమల సుమకుట్మలాలు
మధుమాంసోన్మత్తచిత్త
కాముకజన కామకేళి
కాహుతియౌ కాంతామణి

కవులకేల కనుపింపవొ
ఇటు భోగులు అటురోగులు
ఇటు ధనికులు అటుపేదలు
ఇటు అజ్ఞులు అటువిజ్ఞులు
ఇటు దుష్టులు అటుశిష్టులు
వీరివలన వారు పొందు
నష్టకష్టనాశనముల
అనుభవించి అనుసరించి
అష్టకష్టమర్థమైన
అంతరంగికావేదన
కనుల నీరు గార్పించుచు
వెలివచ్చును పెల్లుబుకుచు
కవులందరు కాదులెమ్ము
కనితంతయుకాదుపొమ్ము
అసలు కవిత యనునట్టిది
ఆదికవిత ఆదికవికి
నిషాద హతవిషాదయుత
పతంగ సంగభంగ జనిత
శోకంబే శ్లోకమయ్యె
ఇష్టభోగ మిష్టాన్నం
పుష్టిగల్గి తుష్టితోడ
తిష్టవేసి కష్టపడుచు
కవిత వ్రాయు కవులు కలరె!
ధర్మమంత ధరణి పాలు.
నీతిమున్నె నీటమునిగె

దయారసం దగ్ధమయ్యె
కరుణ గలిసె గగనంబున
శీలమటుల శిథిలమయ్యె
మిగలదొకటి మేలిగుణం
అన్యాయం అధర్మంబు
అవినీతియు అక్రమమును
అధికారం అర్ధచింత
అజ్ఞానం అధికమయ్యె
సద్విద్యా సద్బుద్ధియు
సత్క్రవులును సత్క్రవితయు
సత్సంఘం సంఘానికి
కావలె నీ కాలమందు
కాని యవే కఱవయ్యెను
ఉపమానం ఉత్ప్రేక్షయు
రూపకమును దీపకమును
వ్యాజస్తుతివక్రోక్తులు
అతిశయోక్తులవసరమా!
స్వభావోక్తి చాలునెమ్మ,
అవధానంబాశుధార
కవితకేమి ఘనతకావు
సన్నివేశ సంఘటనల
సమీక్షింప సంభవించు
ఆవేదన అశ్రుధార
కవితకగును ఘనతనుమా!

17

# కావ్యము

నాటి వికేటికి నేటికి
కవిత్రయము కావ్యశైలి
పోతన పదగత యాతన
పెద్దన పద్దెపు యుద్ధము
శ్రీనాథుని శృంగారము
భట్టుమూర్తి ధిట్టతనము
తిమ్మన కమ్మని కథనము
సూరన సురుచిర భావన
రామకృష్ణరసికతయును ॥నా॥

భారత దుర్భరభారం
వసుచరిత్రవయ్యారం
భాగవతాద్భుతభావం
నైషధనిగిషితవంబు
మనుచరిత్ర మాహాత్మ్యం
పారిజాత పరిమళంబు
పాండురంగ ప్రౌఢత్వం
ప్రభావతీ ప్రద్యుమ్నం
కళాపూర్ణ కల్పనంబు ॥నా॥

శూర, వీర, ధీర, వరుల
దారుణ మారణహోమం
శౌర్యశౌను శంసనములు
ఖడ్గగళాళనీఖణాత్కృ
పటహభేరి భాంకృతాలు

కోహల కోళాహలములు
ఆహా ! ఓహో ! రములు
తాతలనాటివి వ్రాతలు ॥నా॥

చర్వితచర్వణమేయివి
పేషితపేషణమేయివి
ఖాదితఖాదనమేయిది
రోదిత రోదనమేయిది
పద్యగద్యపరివృతమై
పండిత కవిమండితమై
పామరులకు పనికిరాని
ప్రాచీనపు కవితపోని ॥నా॥

కదలించే పదముచాలు
కరగించే కవితమేలు
మరపించే మాటచాలు
మురిపించే ముక్కమేలు
కర్షక కార్మిక బాధలు
నేతల జేతలగాధలు
నీతి నిజాయితి బోధలు
కావలెకవికారాధ్యలు ॥నా॥

పూర్వము పూజ్యము, కాదన.
అర్వాచీనపురచనము-
సర్వసమానత భావము.
నేర్చుకొనుము నేర్పింపుము.
పోవలె విషాద ఘట్టం

19

కావలె విశేషచట్టం
రావలె మనస్సుకు దిట్టం
తేవలె సర్వము మట్టం
దేశీయత భాషీయత
జాతీయత నైతికతయు
సమానతల సాధించుటె
కవివరులకు కర్తవ్యం ॥నా॥



# భాష

మాటలాడు మాటలలో
ఒకరిభావ మొకరెరిగిన
భాషయనగ బరగుగాని
ఒకరిభావ మొకరెరుగని
భాషవృథా భషణమౌను
ఆంధ్రులకే అర్థమవని
ఆంధ్రభాష యనర్థంబు
తెలుగుభాష తెలియకున్న
తెలుగునకే తెగులుగాదె
యతినేటికి వెతకవలయు
ప్రాసకేల ప్రాకవలయు
అర్థమున్న [illegible]
అనుప్రాసయైన చాలు
ఆంధ్రభాష కాకున్నను
ఆంగ్లభాషయైన సరే
లార్డుకార్డు బోర్డువేసి
కవితయనే కవియొకడు
రక్షభక్ష శిక్షవ్రాసి
కవితేయను కవియొకడు
సజా భజా మజా జూపి
కవితలనే కవులిందరు
ప్రాసకొరకు ప్రాలుమాలి
పలుభాషలు కలుపనేల

పనికిరాని పదములేసి
కవిత్రవ్రాయు కవులందరు
భావకవులు హావకవులు
భావహీన భాషవ్రాయు
భావకవిత హావకవిత
అర్థమున్న అనుప్రాస
ఆనందం అతిమధురం
అర్థమవని అనుప్రాస
వ్యర్థమైన యతిప్రాస
కనబడు నీకాలమందు
కఠినపద గ్రథితమైన
కావ్యమేల కాల్చనా!
పండితులకు పనికివచ్చు
వ్రాతలేల వ్రాయువలయు
పూర్వమందు బుద్ధదేవు
డందరకును అర్థమవని
సంస్కృతమును చాలించెను
ప్రాకృతమును పాలియును
ప్రజలకొఱకు వ్రాయలేద ?
నారచనలు నా యంతటి
పండితులకే పనికివచ్చు
పామరులకు వ్రాయలేదు
అనుకున్నచో అర్థమేమి!
దిగిరండిక శిఖరమునుండి
సామాన్యుల చక్కబరుప

సాధారణ పదములేసి
సారస్వత సారంబును
సరలమైన సరసమైన
భాషలలో వ్రాయవలయు
కవితకదే కమనీయత
చరితకదే చరితార్థత
పరమార్థం భాషకదే
పరాకాష్ఠ భావమదే!
పూర్వకవుల పోకడలను
తెలుసుకొనే తెలుగుకొఱకు
వ్యాకరణం వ్రాసినారు
ఇప్పుడట్లె చెప్పుమనుచు
భాషనెవడు శాశించును
సంస్కృతమున జన్మించిన
సులభ సుభగ లలితకలిత
మృదుల మధుర పదములనే
వాడుకొన్న బాగుండును
సర్వభాష సంస్థితమౌ
సంస్కృత పదజాలంబులు
సులభముగా స్ఫురియించును
ప్రకృతికేల వికృతిమరల
సంస్కృతమే జననికదా!
తెలుగులోన దిగినప్పుడు
కచటతపల గసడదవలు
గజడదబలు గలుగనేల

అలఘులఘువు యరలవలకు.
రఱల లళల నఱలేటికి?
చచల జజల జతలేటికి
అనవసరపు టరసున్నలు
చచ్చువఱకు జదువుకొన్న
తెలియనట్టి తేటతెలుగు
మార్పుచేర్పు మర్మములతో
అసలురూప మర్థమవక
తలపగిలెడు కాలమొచ్చె.
వ్యాకరణంబను జలధిని
మునిగితేలి మునుగువేసి
జటిలసంధి జాలబద్ధ
గ్రాంధికపద కవనమేల?
మార్పులేని మాతృభాష
పదములెల్ల భాషలలో
కలుపుకొనే కాలమ్మెపుడు
వచ్చునురా భగవంతుడ !
ఏటికింక ఏండ్లు బ్లూండ్లు
భాషకొఱకు వ్యర్థమగుట
తేనెతీపి తెనుగుబాస
తెలుగు వెలుగు నలుదిక్కుల
వ్యాపించుచు ప్రాకవలెను.
ప్రజాభాష రాజభాష
న్యాయభాష చేయవలెను
ఆంధ్రదేశమందు దాని

గౌరవించ గలిగినపుడె
తెలుగు వెలుగు వెలిగిపోవు
ఆంధ్రరాష్ట్ర మవతరించి
ఆంధ్రభాష యంతరించె
ఆంగ్లభాష సంతరించె
కడుపాత్రపు కాన్వెంటుల.
అనుగు తెనుగు ఉబ్బాయికి
అమ్మ నాన్న యనుటరాదు
ఆంగ్లభాష నభ్యసించి
మమ్మీ డాడీ యూర్చెను
తెనుగుబాష మన్నగడకె
తిప్పలొచ్చె ముప్పొగలిగె






## ఎద్దు [బసవన్న]

ముందు జన్మమందు నీవు
ఎవరినెట్లు యేడ్పించితో
అన్నెమేమొ పున్నెమేమొ
దేవునికే తెలియుగాని
జగతిలోన జన్మమెత్తి
తల్లిపాలు త్రాగినంత
పరులపాల పడిపోదువు
పాపమయో! బసవన్నా!
కొన్నవారె కన్నవారు
కన్నతల్లి కానరాదు
బ్రతికినంత పర్యంతం
యజమానిని పూజింతువు
స్వార్థరహిత ప్రజాసేవ
చేసికొనుచు జీవింతువు
నిన్ను నమ్ముకొన్నవారి
సొమ్మెప్పుడు వమ్ము కాదు
ఏ వేళల యే నేలల
తిరుగుదువో యెరుగలేవు
అంధకార బంధురమౌ
అర్ధరాత్రి యందైనను

కాడిమాను మెడనుబెట్టి
పొమ్మనగా పోయెదవు
ఎంతవఱకు ఎందుకొఱకు
ఏదారికి యే ఊరికి
అనికూడా అడుగవయ్యా
లేయమన్న లేచెదవు
మేతవేయ మేసెదవు
ఊరకున్న ఊరకుందు
విమ్మనవే తెమ్మనవే
ఎంత శాంతిమంతుడవో
మోయలేని మోతబెట్టి
మోయలేక పోయినచో
చెల్లకోల ముల్లుగట్టి
వీపుపైన వాపుపుట్టు
మోతమోసి పోవుగదా!
గాలికుంట్లొ కాలికుంటొ
అట్టువావు కఱ్ఱుపోటు
కడుపునొప్పి కలిగినపుడు
చెప్పలేక చేయలేక
ఊరకున్న జారుకున్న
అంకెవేసి పెంకెజూప
ముక్కులోని మొగదాడును
పట్టితిట్టి కొట్టుచున్న
అంబా! అని అరచదవే
అంతకన్న అనవేమియు
అయ్యయ్యో! అంతరాత్మ

కాలిపోవు కరగిపోవు
కొన్నవారు కన్నవారె!
బిడ్డలున్న దొడ్డవారె
మరణించిన కరుణించరు
ఆవుతోటి ఆనందం
అనుభవించుటైన లేక
కోడెదూడ కొడుకువోలె
ముద్దుగొలుపు దుద్దుకొనును
నాలుకతో నాకుచుండు
కన్నులతో నిన్నుచూడ
పొంగిపోయి చెంగలించు
అట్టిదాని చిట్టచివర
శక్తిలేని సమయమందు
నడువలేక విడిచిపోవ
కాలాడక జాలిగొల్పు
చూపులతో చూచుచున్న
జాలిగుండె కలవాడ
కటికవాని కర్పింతువ !
నిన్ను నమ్ముకొన్నదాని
సొమ్మునకై అమ్ముదువా
దానిమీద దయజూపుము
బిడ్డవోలె పెంచుకొనుము
కడుపుకొలది కసవువేసి
బలముకొలది బరువుపెట్టి
మేతకొరకు బ్రతుకునట్టి
జాతినెపుడు జాగ్రతతో
పోషింపుము పుణ్యముండు!

## ఆవు (గోమాత)

పూజ్యయౌ మాతయు, భూమాత, గోమాత,
మనుజుల కారాధ్య మాతృత్రయంబౌను
జన్మనిచ్చిన జనని జననమొందినయవని
క్షీరమిచ్చేగోవు శ్రేష్టమౌ తల్లులు
గోమాత నీవు నీ కొడుకులు ఘనులౌచు
భూమిని దున్నుచు పొలములో పనిచేసి
పైరులు పెట్టించి పంట పండించేరు
దానిలో సారమౌ ధాన్యంబుకైకొని
కొఱగాని దరరాని తరకలు బొంతలు
మీకు వేసిన తిని మెదలకుండెదరమ్మ
చెత్త చెదారమో చెఱకు పిప్పినోతిని
మధురమౌ క్షీరమును మాకు దయచేసెదవు
పాలులేకున్నను పాలుమాలినగాని
నీయట్టు కురివేసి నీకాల్లు బంధించి
దూడలను గాటికి దూరాన కట్టేసి
కోపంబుతో నిన్ను కొట్టుచు తిట్టుచు
పాలుపితుకుచునున్న పలుక కుండెదవమ్మ
కొండకోనలకేగి ఎండిపోయినపూరి
ఆకులలుములు దిని అరగించుకొందుపు
ప్రత్యక్షముగ మేము భక్షింపగారాని
గడ్డిగాదముతిని కడుగునీల్లనుత్రాగి

చెత్త చెదారాన్ని క్రొత్త పాకముచేసి
ఆరోగ్యకరమైన అమృతమ్ముగా మార్చి
బలము కలిగించేటి పాలనిచ్చేదవమ్మ
అమ్మపాలకు మారు కమ్మనౌ నీపాలు
పసిపాపలకు నిచ్చు - పరమ దేవతవమ్మ
సంపూర్ణమైనట్టి సాత్వికాహారమౌ
పాలుమీగడవెన్న పరమపావనమైన
నేయిత్రాగుట కూడ నీపుణ్యమేకదా !
గోదుగ్ధ, గోఘృత, గోమయ. గోమూత్ర
గోశక్తులకు మించు గొప్పదేమున్నది
నీపేడ, నీగంజు, నీపాలు, నీతోలు
పనికివచ్చును మాకు బహువిధంబులుగను
మట్టిలోనున్నట్టి - మలినాల తొలగించు
పైరుకు బలమిచ్చు-పాకంబు చేయించు
విద్యుల్లతనుబోలె - వెలుతురు గలిగించు
అన్నివిటమినులున్న ఆవుపాలనుత్రాగి
బాలింతరాండ్రును పాపలు బ్రతికేరు
ఔషధంబులలోన ఆవునెయ్యినివేసి
సేవించి రోగులు జీవించుచున్నారు
గోక్షీరమెంతయో గొప్పగా తలపోసి
త్రాగుచునున్నారు - తాతముత్తాతలు
వనములలోనున్న మునులు యోగులుగూడ
అతిబలంబైనట్టి ఆవుపాలను త్రాగి
వేదవేదాంగాది విజ్ఞాన ధనులైరి
అందుకే ఋషులెల్ల నాశీర్వదించిరి

"గో బ్రాహ్మణోభ్యో శుభమస్తటంచు"
బ్రహ్మజ్ఞులై మహాపండిత ప్రవరులై
పరమ పావనులైన బ్రాహ్మణుల్ గోరీతి
పరుల మేలునుగోరి బ్రతుకుచుండెడివారు
సురభి సమాన భూసురులు నాడునునేడు
శుభములొందాలని సుఖము పొందాలని
గీర్వాణ భాషలో గీతలో నుడివిరి
మొదవు యప్పటియట్లు మెదలుచున్నదిగాని
తమబుద్ధి బలమును తప్పుదారికి ద్రిప్పి
బ్రాహ్మణుల్ భ్రష్టులై పతితులై పోయిరి
జన్మనా బ్రాహ్మణుల్ జగతిలోగలరేమొ
కర్మనా బ్రాహ్మణుల్ కనుపించకున్నారు
శిష్టులు కొందరే - చెలగుచున్నారిల
ఈతలెన్నోయీని యెన్నియో యేండ్లుగా
ఉపయోగపడునట్టి - ఉత్తమ గోవును
వట్టిపోయినవేళ పెట్టిపోయగలేక
ముసలి ముప్పునవేల ముప్పుగావింతురు
మనము చంపినగాని - తాను చచ్చినగాని
పరులకే ఉపయోగ - పడుచుండు గోమాత
మాంసంబుకైదాని మనుజులు చంపిన
ఒక్కపూటకెకాని పెక్కురోజులు రాదు
బ్రతుకుతే పదునైదు వర్షముల్ పాలిచ్చు
పాడిపంటలతోడ వర్ధిల్లవచ్చును
తరపుదూడలజంపి మురికిమాంసము దిని
పశుసంపదనునిట్లు పాడుచేయగరాదు

ప్రాణిహింస యొనర్ప పాపమో పుణ్యమో
దానిని గూర్చియు తర్కింపగానేల
మతమేది యైనను మానవత్వములేని
మనుజులు హింసను మానజాలరుగదా ?
గోహననంబతి ఘోరపాపంబని
మాంసంబుకై దాని మర్దింపరాదని
మతకర్త, మతవక్త, మతగ్రంథములలోన
నీచాతినీచముగ నిందగావించిరి
గోకళేబరములనేక బేలములోన
నాశనముచేయుట న్యాయంబుగాదని
శాసకులెందరో శాసించుచుండిరి
సంఘకర్త లెందరో చాటిచెప్పినగాని
మాంసంబు తినువారి మనసుమారుటకల్ల
పశుసంబదిప్పుడే పలుచనైపోయినది
పాడిపరిశ్రమ వర్ధిల్లవలెనన్న
ఆవులగేదెల నందరుచాకాలి
గోపాల కృష్ణుడు గోవులకాసెను
సహదేవుదావుల సంరక్షణముచేసె
ఆశ్రమంబులోన నావులమేపిరి
అందులో నవమానమావంతయునులేదు
పశువుల పోషించి పాడిపంటల పెంచి
దేశరక్షణజేయ దీక్షబూనగరండి
పసుపుకుంకుమ పూసి పాదంబులకు మ్రొక్క
పూజచేయుటగాదు భువిలోన ప్రజలారా?

కడుపునిండాగట్టి గాదముతౌడేసి
దాని పోషించుటే ధర్మంబు నరులకు.
అప్పుడేమనకది అత్యుత్తమంబైన
అన్నిసత్తువలున్న ఆహారమొసగును.
పశువుల పోషించు పావనుల్ బ్రాహ్మణుల్
గోబ్రాహ్మణేభ్యో శుభమస్తుభూయః
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు॥



అచటనైన ఆలోచనచేసి విసిగివేసారుచు
స్మృతిలేకయె పతితమైన బలములేని బక్కవాని
పాలుబోసి బ్రతికించెను ఆతల్లి సుజాతమ్మయె
స్నానసంధ్య జపతపములు క్రతువ్రతాది కర్మలెన్ని
గావించిన కరుణలేని మానవుడొక మానవుడా?
ఈసత్యంబేరీతిగ బోధపడెనొ బుద్ధుడవై
కరుణశ్రీమూర్తివగుచు నతివిశాలమతివైతివి?
స్వపరభేదమిపుడు లేదు శాఖ్యదేశజనులెగాదు
సర్వలోక సంతతియును నీవారను నిర్ణయమే?
క్రిమికీటక మృగఖగాది సర్వప్రాణిసముడవయ్య
అవధిలేనిదాప్రేమయె అంతులేనిదాకృపయే
జీవహింసచేయలేని ప్రాణిహత్యపనికిరాని
సదయహృదయ సర్వజ్ఞా దయానిధీ! ధర్మరాజ!
చతుర్వేదసారవేద జాతిమతాతీతభావ!
పంచశీల ప్రబోధకా! పరమసాత్వికాకారా!
దుఃఖానికి కోరికలూ దురాశలే కారణమని
జనన మరణ చక్రములో తిరుగుటయే జరుగుననియు
ప్రాణిహింస పాపమనియు బోధించిన బుద్ధదేవ!
అవతారములన్నిటిలో అత్యుత్తమమైయొప్పిన
భగవానుని భాగమీవె అనితలచెద నినుకొలిచెద





# స్త్రీ

మగువలేల మగవారికి ఆటబొమ్మలైపోయిరి!
ఆడవారి అంతస్తును అందుకొనరు మందమతులు
పురుషాదధికానారీ అన వినరా! వీనులార
వాఙ్మయమును వారిపరమెజేసికొనిరి మోసగాండ్రు
చదువేటికి సామేటికి ఆడవారికనువారలె
ఆదిశక్తి అబలయౌన! మాతృదేవి మహిళగాదె!
రాజ్యమేలు రమణీమణి అనికేగినమానినియును
కవిత్రవాయు కామినియును భక్తిగల్గు భామినియును
ముందుకాలమందులేరె! ఎందుకిపుడు తేలికైరి
వారిశక్తి, వారియుక్తి. వారిరక్తి, వారిభక్తి
వీరికెందు క్రిందైనది! తీసిపోయె! తెలియలేదు!
వారిజాతి నరజాతియె నారీమణియౌరసులే
ఆడవారికాడవారు మగవారికి మగవారలు
పుట్టలేదు అటులైన! బేధమేమొ బోధపడదు
మాతాపిత, సతీపతుల, వధూవర స్త్రీ పురుషుల

ప్రథమ నామగ్రహణమేల? పరమపూజ్యభావమేల?
సహధర్మం సహచరణం సహకార్యం సహవాసం
చెల్లుననుచు చెప్పినారు వివాహంబు వేళలందు
ఐనవారినణచివేసి అతిమూర్ఖుల మతిహీనుల
చేతులార చేసుకొనిరి పురుషులెంత పొరపడిరో!
ప్రకృతిమాత యాకృతిగను భాగ్యమైన పడతికేది!
మునుగువేసి మూలదోసి స్వార్థమునకు వాడుకొనిరి
సమతలేని జతకూడిన సంసారం సాగించుట

సంతానపు చదువు సంధ్యలధిక భారమతనికగును
సతీపతులు జతబాసిన సమముగాని శాస్త్రమేల?
మగడుపోవ మగనాలికి గుండుగొర్గి ముండమోపి
కఠినశిక్ష గావింతురు పుట్టింటికి నెట్టివేసి
ఆస్తి పాస్తు లసలివ్వరు బ్రతుకె మహాభారమగును
ఆలుపోవ చాలులెమ్ము మగవానికి మారుమనువు
క్రొత్తపెండ్లికొడుకొగదో! మహానందమగును బ్రతుకు
ఉప్పుపులుసు పప్పుబువ్వ తినిపెరిగిన తనువుగాద ?
క్షామమేల కల్గకుండు కోర్కెలెట్లు కొండెక్కును
కాంతకెంత వంతగల్గు అంతులేని సంతాపం
చింతజీవితాంతముండు ఆధిపత్యార్థి కగుపించును!
కర్మవలన కాలుజారి ఆడవారు పాడైనను
బలవంతపు పాపానికి బలియైనను బాలికలను
పాలిచేయుటో నలిచేయుటో కులమునుండి వెలివేయుటో
మారుమూల క్రమ్మగించుటో జరుగుచున్న సంగతియే
పురుషుడట్టి పొరపాటును జేసినప్పుడు వాసికెక్కు
విటపుంగవ, నటశేఖర, సరసరసిక బిరుదులొందు

పతిబాసిన పడతిమోము పయనమైనవాడు జూడ
కార్యహాని కలుగుననుచు ముండమోపి ముండనాకు
ఎదురైనదిఏదో ఒక్కకీడు నేడుమూడుననును
కీడుకలుగు జాడజూప మేలుకొన్న మేలుగాదె!
బాధపడేవారి మదిని వేధించుట వేడుకయ్యె
వారుచేయుపాపమేమి వారినననిన పాపమగును
ఆడవారుకూడ నేడు అధఃపతితులై పోయిరి
అవయవాలె అగుపించెడు విధముగాగ వేషమేసి
విందులందు వినోదముల నగ్ననృత్య నాట్యాదుల
దిగజారుచు దీనులైరి పడుపువృత్తి వదలుకోక
వారుకూడ వారి కీడు చేసికొనుచు చెడిపోయిరి!



# వరకట్నము

భరత దేశములోన ప్రాచీనమందు
ఉన్నవారైనను లేనివారైన
అతివకు శుల్కములాభరణాలు
అత్తమామలెయిచ్చి ఆది మొదలింటి
కొడుకులు కోడండ్రు కూతుర్లు కలసి
సంసార రథమును సాగించువారు
తల్లి దండ్రులుకూడ తనయధనంబు
ఆభరణాలకై ఆమెకే యిచ్చి
పెండ్లి పేరంటాలు ప్రీతిగాచేసి
అత్తగారింటికి అంపెడివారు
అన్నతమ్ములు తమయాడుబిడ్డలను
రాకపోకలు చేసి రాగంబు గలిగి
ఆప్యాయముగజూచి ఆదరించెదరు
అత్తగారింటిలో నాస్తులు పొంది
ఆడపిల్లలు సుఖమనుభవించెదరు
తమ జీవితమునకు తామె కష్టించి
పనిచేసి బ్రతుకుట పరిపాటి యగును

తండ్రి సంపాదించుధనముతోగాని
అన్నదమ్ములపైన నాధారపడియు
బ్రతుకుచుండెడివారు బహుకాలముగను
స్త్రీని ధనంబును తెమ్మనిచెప్పి
దానితో బ్రతుకుట తప్పుగానెంచి
స్త్రీల తెమ్మనుటకే సిగ్గు జెందెదరు
అటువంటి ఆచారమటుపైన మారె
విధిలీలచేనది విపరీతమయ్యె
అల్లారు ముద్దైన ఆడపిల్లలను
కుంటికి గ్రుడ్డికి కూరూపికైన
ముదుసలికైనను ముగుధల నొసగి
ధనముగైకొనువారు తల్లిదండ్రులును
ముదుసలి మగనితో మూన్నాళ్ళు మురిసి
వైధవ్యమును బొంది వెతజెంది కుమిలి
కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండు
బ్రతుకు భారంబయ్యెపడతులకయ్యె?
ఆడవారై పుట్టనగచాట్ల బ్రతుకె
అక్కటా యీ రీతి నాడపిల్లలను
అమ్మనాన్నలెయెట్టులమ్మెడివారొ?
వార్ధకమ్మునన్నున్న భర్త చచ్చినను
సహగమనముచేసి చచ్చిపోవలెను
చావకపోయిన సంఘమేనాడు
పాపపుణ్యముఁ లేక బంధించివైచి
వానిచితిపై వేసియైనకాల్చెదరు
కాంతవిక్రయములు కన్యశుల్కములు

బాల్యవివాహాలు బహుభంగులైన
సహగమనాలును సమసిపోయినవి
సంస్కర్తలుదయించి చక్కబెట్టంగ
వరకట్నమిపుడొచ్చె వరకట్నమిపుడొచ్చె
బహుకష్టమైనట్టి వరకట్నమిపుడొచ్చె
కాట్నమై యువతుల కాల్చ కట్నము వచ్చె

వరకట్నమొచ్చింది వధుకాష్టమొచ్చింది-
ప్రళయకాలమునాటి విలయనాట్యముతోడ
నింగిమేఘము వంగ నేలనీరధి పొంగ
భూధరంబులు క్రుంగ భూరుహంబులుడింగ
దిగ్గజంబులువాల దిక్పుత్రికలు కూల
ఆదిశేషుడు సోల ఆదికూర్మముడీల
కాట్నమై యువతులకాల్చ కట్నమువచ్చె.
బ్రద్దలయ్యె ధరిత్రి దద్దరిల్లెను పోత్రి
కష్టమై నష్టమై దుష్టమై భ్రష్టమై
మిన్నుమన్నేకమై కన్నెపిల్లల్రమింగ
పితరుల భ్రాతల పిల్ప పిప్పియైనర్ప
లయతాళ గతులతో లయకాల శివలీల
ఢమఢమధ్వనులతో డమరుకానాదాన
అ ఇ ఉ ణ్ ఋ ఌ క్ ఏ ఒ ఙ్ ఐ ఔ చ్
తకధిమ్ ధిమ్తక్ తైతక్ శబ్దాలు
దిగ్దిగంతముప్రాక దిమ్మెక్క కర్ణములు
ముక్కంటి మంటతో ముల్లోకముల కాల్చ
వరకట్నమొచ్చింది వధుకాట్నమొచ్చింది
ఆకాశమదరంగ నచలముల్ కదలంగ

అగ్నికంపింపంగ ననిల మల్లాడంగ
జలము కల్లోలమై జగమునే ముంపంగ
అబలల కబలింప నన్నిమైరజ్జువై
గరళమైసలిలమై కాలనాగముపోలె
వరకట్నమొచ్చింది వధుకాట్నమొచ్చింది
చదువు సంధ్యలుగల్గి సౌందర్యవతులైన
ధనములేకున్నట్టి దౌర్భాగ్య యువతులు
వరకట్నమీలేక వయసు మీరుచునున్న
సంబంధములురాక శవములై జీవించు
సుందరీమణులెందరుందురో లోకాన
కట్నాలు కానుకలు కళ్యాణముల ఖర్చు
వస్తువాహనముల వరులకీయగలేక
కళ్యాణములుగాక కళ్యాణులెందరో
అడవిగాచిన వెన్నెలై పోవుచున్నారు
కళ్యాణమైనను కాపురానికి పోయ
అత్తమామలు భర్తలాడబిడ్డలుపెట్టు
అగచాట్లు పడలేక అల్లాడి అల్లాడి
అతివలెందరో ఆత్మహత్యల పాలైరి
ఆస్తిపాస్తులు లేక అస్తుపస్తులుపడి
కూడబెట్టినదంత కూతుళ్ల కిచ్చిన
అదితెమ్ము యిదితెమ్మటంచు నారటపెట్టి
ఏడిపించే భర్తలెందరో ఉన్నారు
మామూళ్లు తెమ్మని మర్యాదలేవని
ఎత్తిచూపుచు నత్త లెత్తి పొడుచుచున్న

తల్లిదండ్రుల చెంత తమ గోడు వినిపింప
తెచ్చియివ్వగలేక నచ్చజెప్పచు నుండి
బ్రతిమాలి బ్రతిమాలి బ్రతుకునీడ్చుచునున్న
చావకున్నను చంపి చచ్చినాదనిచెప్ప
తల్లిదండ్రులు తమపిల్లలనెడబాసి
గోడుగోడుననేడ్చి కూలినారెందరో
అత్తమామలుకూడ నాడపిల్లలగన్న
అమ్మనాన్నలుగార ! హతవిధీ ! యిదియేమి
కూతుల్లనొకరీతి కోడండ్రనొకరీతి
చూచుచుందురిదేమొ చూడచోద్యంబాయె
కూతుల్లు ఒకరింట కోడండ్రుకాబోర?
వధువు తెచ్చేటంత వరునకువుండదుఆస్తి
వధువుకంటే విద్య వరునకుండదుజాస్తి
అందచందములన్న నంతకంటే నాస్తి
ఐనమెడలో కట్టనంటాడు గద పుస్తి !
తాళికట్టినదాది ఆమెపై పెత్తనమె
చేయబూనునుగాని చేయడామెకుమేలు
పనిచేయువారికి ధనమిచ్చెదరుగాని
ధనమిచ్చి పనిచేయు ధర్మమెచ్చెటలేదు.
పురుషులకీబుద్ధి పుట్టుకతోవచ్చె
పురుషోత్తమునకైన పోలేదు దైవమా!
ఆడవారేలనో అలుసైరి యీనాడు
సోదరీమణులార బెదరిపోకండమ్మ
ఎప్పుడోఒకనాడు ఎవ్వడోఒక్కడు
సంస్కర్త వస్తాడు సరిచేసిపోతాడు

మిమ్ము కాపాడును మీకు మేలయ్యేను
మీకాళ్ళమీదనే మీరుకూడానిల్చి
బ్రతుకనేర్పుటకైన జతనంబుచేయండి
తను, మన, ధనముల మనుజుల కర్పించి
ఐహికానందంబు లనుభవించుటకంటె
మనసును మాత్రమే మాధవుపైనిల్పి
అముష్మికానంద మనుభవించుటమేలు
కామాంధమునబడి కన్నుగానని వారి
కైహికానందమే యానందమగునెమొ
తుచ్ఛసుఖములపైన నిచ్ఛపోనీయక
మనసుమాధవుపైకి మరలించువారికి
ఆనందమే బ్రహ్మ బ్రహ్మమానందమే !



# రైతు (కర్షకుండు)

కర్షకునకు హర్షమేది! హాలికునకు హాయిలేదు,
అని కొందరు అనుకొందురు వీనులారా వినుచుందురు
ఎండలోన యెండిపోయి వానలోన నానిపోయి
చలిగాలికి చవికిపోయి యమయాతననను భవించు
తోటవేసి మోటతోలి పండించిన పంటలెల్ల
పట్నాలకు పంపించుచు అందరకాహారంబును
అందించునదతడుగాదె ఆప్తమిత్రుడతడుగాదె!
బీదసాదు నాదరించు పేదలపెన్నిధియౌగద!
అరదేశికి పరదేశికి అతిథులకభ్యాగతులకు
హరిజనులకు గిరిజనులకు అన్నమిడునదతడుకదా!
కాపువారి కష్టాలను వ్రాయనెవరి వశముగాదు
మాపుతోటకాపుగాయు రేపుపశుల మేపుకోయు
పగలంతా పాటుపడును అన్నమదునకందకుండు
ఇంటిలోన ఇల్లాలికి పంటినొప్పి కంటికలక
మూడుకాళ్ల ముసలివాండ్రు ఖుక్కుచుండ్రు మూల్గుచుండ్రు
పిల్లవాండ్రు గుల్లలతో కుమిలికుమిలి కుసిలింతురు
దుక్కిదున్ను బక్కెద్దులు గాలికుంట్ల కాల్గుకుంటు
ఇడుములెన్నిపడుచుండిన కూలినాలికొచ్చువారు
వారికెవరు దొరకకున్న జంటలేక ఒంటిగానె
పొలములోన కలములోన పగలురాత్రి పనిజేయుచు
చలిగాలికి జలపుచేసి జ్వరమొచ్చిన. జబ్బుచేయ
బుజ్జగించు వెజ్జులెవరు!
అతనినప్పుడాదరించు అప్తులెవ్వరగుపించరు

వానిపంట పండగనె ఇంటిముందు గంటవాంచు
జంగమయ్య, లింగమయ్య సంకలోని సంకునూది
శంకర శివశంభో అనుపెట్టుకున్న తిట్టిపోవు
గంగిరెద్దుగాండ్రువచ్చి మేలమూది డోలువాంచి
లేదన్నను కాదన్నను గోలజేసి గేలిజేయు
అతనబ్బని ఆస్తియేది అపహరించినాడాతడు
అయ్యగారు జియ్యగారు సాతానులు సన్యాసులు
రక్షకులును, భిక్షకులును అందరతని నడుగువారె
వానిబండి వాటుబడినఎత్తువారలెవ్వరయ్య
ఊరకుండి ఉదరమెక్కి కదలలేక మెదలలేక
బరువెక్కిన బడుద్దాయి ఉద్యోగుల ఉదరంబులు
వానిపీక్కితినునట్టివి కాని వానినాదుకొనవు
మేడలలో నీడలలో సుఖమునందు సోంబేరులు
కారులో షికారుకేగు షాహుకారు సంసారము
వానిపైనపడునట్టిదె వానిదోచి తినునట్టిదె
వానికేమిపనిబడినను పలుకునట్టివారులేరు
అందరతని కధికారులె వానిపంటవారసులే
ధాన్యానికి దాయాదులె అపదలో నాదుకొనే
అయ్య ఒక్కడగుపించడు దొరకినంత దొరికినట్లు
దోచుకొనే దొరవారె లంచమున్న మంచమెక్కు
పద్ధతియే ప్రబలిపోయె పల్లెటూరు పిల్లవాండ్ర
చదువుసంధ్య కొదువయగును
బడిపంతులు బడికిరారు
అధికారులు అనలడగరు
మాటచెప్పి ఓటుగొట్టి ఎన్నికైన ఎం. ఎల్. ఏ. గా

అసెంబ్లీకె హాజరవడు రైతుగూర్చిరాదు చర్చ
ఎందుకొఱకు ఎన్నికైరో ప్రజలకేమి ప్రతినిధులో
సరసముగా సరుకుపోవు ధాన్యానికి ధర ఉండదు
పలుబాధలు పడుచుండును యారముట్లు దొరకకుండు
కొరముట్లను కొనవలసిన. ధరలన్నియు పిరియమగును
ఎరువులధర ఎక్కువగును తరగిపోయె ధనమువిలువ
అనావృష్టి అతివృష్టుల కఱవుకాటకములొచ్చిన
తినుట కొఱకు తిండిలేక కట్టుటకే బట్టలేక
దుడ్డుబెట్టి గొడ్డుగోద మేతకొనుట చేతగాక
ఇల్లునేల కొల్లబోయి నానాటికి హీనమైన
బ్రతుకు బ్రతుకువారినైన బాగుపఱచు ప్రభువులేడు
ఊరకతని పేరుచెప్పి బ్రతుకునట్టి పాపిష్టులు
సమయమునకు సాహాయ్యమ్ము చేయునట్టిచెనటులెల్ల
అతని యింట నరకదున్ను ఎద్దుజన్మమెత్తవలయు
కాననతని కష్టములను పంచుకొనుట పాడియగును
సేదదీర్చి సేవచేసి చక్కబరుప సమయమిదె
వ్యవసాయము బరువగుచో రైతులేమి సేతురింక
దేశమునకు తిరోగతే పురోగతియె జరుగబోదు
పట్టపగలు నట్టనడిమి ఎండలోన మండిపోవు
కష్టపడెడు కర్షకునకు దుక్కిదున్ను బక్కెద్దుకు
సాయంబును చేయు నే యుపాయంబును కనుగొనరే
మేసిమేసి మసలుచున్న పట్టణాల ప్రజలకేల
విద్యుల్లత వెలగవలయు వింజామరవీచవలయు
వంటలదే వండవలెను పాటలదే పాడవలెను!
వీరిదొకటి వారికొసగ వారిబ్రతుకు బాగుపడును

పనిబాటల దినములలో కులవృత్తులు గలవారలు
ఆదుకొనెడి అలవాటును మరచినారు, మాటవినరు
పొలముపనికి కూలిహెచ్చె పెట్టుబడులు ముట్టలేదు
ఆలుమొగుడు ముసలిముతక పిల్లజల్ల అల్లాడిన
వానలేక పైరులేక వాని బ్రతుకు బైటపడును
ఎన్నాళ్ళని కన్నీటితో కాలంబును గడుపగలడు
వానవచ్చినపుడైన వాగులలో వంకలలో
పారిపోవు నీరంతయు నీరధులో వారిధులో
నెలకొల్పుచు నిలువజేసి వారిపొలము పారించుచు
కళవుబాపు తెలవుజూపి కాపువారి కష్టాలను
రూపుమాపు దొరవారలు కన్నులకే కానరారు.
రైతులైన చేతగాని చదువుకొన్న చవటలైరి
ఊరూరను వారిసంఖ్య ఎక్కువైన నేమిఫలము
ఒకరిమాట ఒకరువినరు ఓటువిలువతెలిసికొనరు
ఐకమత్యమనుటలేదు ఎవరిదారివారిదగును
కొట్లాటలు ఖూనీలు కోట్లధనము కొల్లబోవు
పోలీసుల పొట్టనిండు లాయర్లకు లాభముండు
అందరొకళ్ళైన యడల పాలకులే వారగుదురు
రైతురాజురాజ్యమేలు రౌతువలే స్వారిచేయు



# నైతిక పతనము

ఈజాతిని ఏరీతిగ బాగుపరచగలవుసామి!
బాగుపడదు బాగుపడదు బాగుపరచలేవు సామి!
అవతారములెన్నెత్తిన ఆదర్శంబుగ నుండిన
కుక్కతోకవంటి జాతి చక్కబడదు చక్కబడదు
సాత్వికభోజన ప్రియుడై సాత్వికభావము గల్గియు
పరమశాంత గుణములతో పంచశీల పాటించుచు
నైతిక పతనము జెందక నీతినిజాయతి గల్గిన
మానవుడే మాధవుడగు మర్త్యుడేయమర్త్యుడగును
నరజన్మం బిలలోపల తరుణోపాయంబనుచును
సర్వభూతహితముగోరి సర్వజ్ఞునిచేసినావు
సర్వజ్ఞుడనేనేయని సర్వభూతహతముజేసి
మానవుడే దానవుడై హీనజన్ముడైపోయెను
చేయుచున్నదొకటైన చెప్పుచున్నదొకటగును
వ్రాయుచున్నదొకటైన కూయుచున్నదొకటౌను
ఆంగ్లేయుల సాంప్రదాయమాంధ్రజాతి కలవడెనే
ఒకప్రాణినియొకడు తినును ఒకనిరక్తమొకడుత్రాగు
దోచుకొనగ నొకరినొకరు చూచుచుందువేమయ్యా!
దుష్టశిక్షణముచేయుచు శిష్టరక్షణముచేయగ
పదియవతారమునెత్తియు పేలుబాధలు పడినాడవు
అష్టకష్టముల పొందియు శిష్టుడవైమనినాడవు
ఐన నిన్నుమఱచిపోయి అవినీతికి ప్రాల్పడుదురె!
అడవులలో నాశ్రమాల నాకులలుమూలును తినుచును
శాంతశమదమాద్యనంత సద్గుణ సంశోభితులై

స్వార్థచింతయును లేకయె శాస్త్రరచన గావించుచు
మనినమునుల మార్గంబులు మానవులకు కనిపింపవు
చంద్రలోకమ్మునకేగే యింద్రభోగములు పొందే
సాధనముల సృష్టించిన శాస్త్రజ్ఞులు గలరుగాని
తనవలె నితరులజూచే ధర్మాత్ములు కరుణాలులు
నీతినిజాయితి గల్గిన నేతలిలను లేరయా ?
హరిశ్చంద్ర చక్రవర్తి అల నల శిబి సామ్రాట్టులు
శ్రీరాముడు శ్రీకృష్ణుడు నరనారాయణమూర్తులె
వ్యాస వశిష్టాది గురులు వాల్మీకి శుకాది ఋషులు
శంకర, వేమన, పోతన, శివజీవైక్యము చెప్పిరి
కులమతముల నిరసించెను యిల నలనాడే బుద్ధుడు
నిన్నమొన్న గాంధీజీ నిమ్నోన్నత పరణించెను
ఎందరో మహానుభావు లందరొకటియని పోయిరి
కొందరె నవారిమాట విందామనుకొందురయ్యా!
అన్నిమతము లొకటందురు అన్నిజాతులొకటందురు
అధికారము కావాలని అఖంగిమ్మఖాగి మొలగెదరు
అదికాస్త చిక్కినంత నవకతవక చేస్తారు
ఎవరిమతమువారిదందు రెవరికెవరు గారందురు
రాజురాజె ప్రజలు ప్రజలె యథారాజ తథాప్రజా
మద్య మాంస వధూ ద్యూత మగ్నభగ్న మానసులే
రక్షకులే రాక్షసులై శిక్షింతురు భక్షింతురు
పంచశీల వంచనాయె వ్యసనంబుల వరియించిరి
పాలకులును అధికారులు ప్రజలుకూడనట్టివారె
ఇట్టివేవిలేకుండిన యట్టివానితిట్టువారె
చేతగాని దద్దమ్మని చేయిచూపి చెప్పువారె

ద్రోణ భీష్మ, కృపాచార్య, దుర్యోధన, దుశ్శాసన
కర్ణ శల్య భూరిశ్రవ కౌరవసైన్యంబంతయు
అస్త్ర శస్త్రకోవిదులే అసమానాయుధ నిపుణులె
తలచుకొన్న సమయంబున తనువువీడు సామర్థ్యం
పరకాయప్రవేశములు పరలోకముకేగుశక్తి
మృతునిబ్రతుకజేయుటయు నసుతునిసృష్టిజేయుటయును
కనిపెట్టిన ఘనులందురె కడకెట్టులచనిరందరు
నాగరికులె మతిమంతులె నైతికముగ పతితులగుచు
సూదిమోపినంత భూమి సోదరులకు వదలలేని
ఆజాతికి పట్టినగతి ఈజాతికి పట్టవలెన?
ఒకతల యిరుచేతులున్న ఒకని తెలివితేటలెంత
దశశిరవింశతి కరముల దశవదనుని వశములైన
శక్తులెన్ని యుక్తులెన్ని? శంకరునే వశంకరుడు
పరవనితల కామించే పరమనీచవర్తనుడై
దానవవంశమునంతను తానే నాశనముచేసెను
ఎవ్వరేమి బోధించిన యేరీతిగ నడచుకొన్న
మనుజులేమి మారలేదు మామూలేవారినడక
నీదినీకు మామూలే నీతి నిజాయతిహీనుల
బాగుపరచలేవుగాన పాడుచేయదలచితివా?



## -: యథాతథా :-

ఎందుపోయె జాతీయత ఎచటికేగె దేశీయత
ఏమైనది భాషీయత ఎందుడిందెనైతికతా
సమసిపోయె సమానతా ఆచార వ్యవహారా-
హారవిహారాదులు, మనవన్నియు మరుగునపడె
స్వానుభవం స్వాలోచన, సర్వకార్యసాధనములు.
సర్వోత్తమ చతుర్వేద శాస్త్రంబులు స్మృతిగీతలు.
వాతాతప శీతాదుల ననుసరించి అనుగుణమౌ
గుణశీలాశన ధారణ నియమంబుల నియమించిచెను.
వానిలోన పనికిరాని వానిమాని పనికివచ్చు
వానినైన మనవాటిని పాటించుట పాడియగును
మహామహుల మహాశ్చర్య చర్య సర్వ సాధ్యమగున ?
అల్పబుద్ధి కందకున్న పనికిరానివనిభావమ ?
కష్టసాధ్య కార్యంబుల చేయలేని చేతగాని
మొద్దయ్యలు దద్దమ్మలు సులభమైన సుఖంబైన
కార్యంబుల గావింతురు. ఒకరినొకరు ఒకటికొకటి
అనుకరణం అనువదనం - గావింతురు ఘనులబోలె.
సర్వసంఘ సంక్షేమం కాంక్షించెడు ఘనంబైన
సత్యశాంతి సదాచారదయా ధర్మదాక్షిణ్యా
ద్యనే కార్యధర్మబులు పనికిరాని భావంబులు
చేతగాని చెయిదంబులు. అకార్యాద్యనార్య గుణము
లర్థవంతమైనట్టివ ? అచరణీయంబైనవ ?
నీతియేది నియమమేది. ధర్మమేదధర్మమేది
కార్యమేదకార్యమేది సాధ్యమేద సాధ్యమేది

అనునాలోచనలేకయె పరులవైనసరిలెమ్మని
అనుకరణం అనువదనం గావించుటెకానుపించె
ఎవరిననుకరించాలో ఎవరికైన యెఱకరాదు
ఆంగ్లనారి వేషభాషలాంధ్రయువతికెందులకో
అతిశీతల వాతమున్న ఆంగ్లేయుల యాహారం
ఆతపాన నలమటించు ఆంధ్రజాతికెందులకో !
కాపులకేల కాఫీ, టీ, ధూమపాన, మధుపానం
చల్లజేయు చల్లఉన్న చాలమేలు చేయుగదా ?
ప్రాతరోత క్రొత్త వింత కారణంబుగాకుండిన,
ప్రాతలోని పవిత్రతను క్రొత్తలోని రోతతనం
ఎరుగనివా రెవరుందురు? మరచినారు మనవారును
మనదేశపు మహనీయుల మాటలనే మఱచిపోయి
పరదేశపు పరమనీచ భావంబుల పాటింతురు
పరదేశపు ప్రజలయొక్క పరిశోధన ఫలితమైన
సాధనములు సర్వులకును మేలుచేయ జాలలేని
ఏలవాని జోలి మనకు ? మంచివైననుంచుకొనుడు ?
మాననీయ మహాపురుషుల చరిత్రంబుల జదువవలెను
సాటిలేని నాటి మేటికవి, నాయక, కళాకారు-
వేత్రోవన నేగినాడో ఆ త్రోవననేగవలెను
పరికించుచు పరిధైనవి అనువదించి అనుకరించి
మేలుపొందవలెయుగాని యథాతథా సదా వృథా-



# ఉద్యానలతా ?
# పత్తనవనితా ?



ఓహో ఉద్యానలతా ?
ఆహా పత్తన వనితా ?
మా తోటల తీవెలతో
మా పల్లెలపడుచులతో
సాటిరారు మేటిగారు
ఈడుగారు జోడుగారు ॥ఓ॥

నేను రెమ్మలవేసెద
నేను పువ్వులను పూచెద
నేను గాలులను వీచెద
నేను కాయలను కాచెద.

ఏవో పూతలు పూసెద
ఏవో వేషములేసెద
ఏవోనడకలు నడచెద
ఏవోహొయలను చూపెద ॥ఆ॥

ఈ డెవ్వరు జోడెవ్వరు
అని మీలో ననుకొందురు
అవునా ఉద్యానలతా
కాదాపత్తనవనితా ॥ఓ॥

నీవొకింత నిక్కినంత
తోటమాలి తొంగిచూచి
కళకు గండకత్తెరతో
కుత్తుకనే కత్తరించు
పూవులేమి పూచెదవు
కాయలేమి కాచెదవు ॥ఓ॥

తిండి బలము కండపుష్టి
రక్తకాంతి రానివేళ
ఏ వేషములేసికొన్న
ఏపూతలుపూసి కొన్న
అందచందమౌనెట్టుల ॥అ॥

భూసారం పుట్టు గడ్డ
పారునీరు. స్వాతంత్ర్యం
గల తీవెలు పొలములలో
కొమ్మసాచిరెమ్మలేసి
అన్నిప్రక్కలల్లుకొనుచు
మొగ్గలేసి పూలుపూచి
కాపుగాసి కాయలన్ని
యింటివానికిచ్చి వేయు. ॥ఓ॥

చిట్టిపాదుపెట్టుమట్టి
పోతనీరు చేతిబ్రతుకు!
పోనీ నిను పోషించిన
వానికేమి యొనగూడును?

కడకు నీదునీడనైన
నిలుచుటకే వీలులేదు
ఎటుల నీవుసాటియౌదు
వెందు నీవు మేటియౌదు ॥ఓ॥

వేగిలేచివేచియున్న
కాఫీలకు కావలసిన
పాలులేక నీల్లు రాక
వంటిల్లేవట్టిపోవ
అంగడింటి కరుగుచున్న
లోన లోటారంబైనను
పైన పటారంబుండును
బిడ్డకు పాలీయలేవు
బిడ్డనెత్తుకొనజాలవు
కడకొకింత నడువలేవు

ముంజేతికి మంజీరము
మణికట్టుకు మణిఫర్సే
బరువగునను భయముగల్గు
అర్ధనగ్నమగునట్టుల
పలుచనైన వలువగట్టి
తళుకుబెలుకు కులుకులతో
నడువీథిన నడచునప్పుడు
బండారమె బైటపడును ॥ఆహా॥

గంపలందు గాదెలందు
ధాన్యరాశి తాండవింప
వేకువనే వేగిరముగ
పెరుగుచిల్లికి వెన్నతీసి
వంటలొండి పనులుజేసి
చంకలోన చంటిబిడ్డ
పుణికెమీద బువ్వపుటికె
చేతిలోన చెంబుగలిగి
పతిచెంతకు పయనమగును
ఆరోగ్యం ఆనందం
దయా, దాన. ధర్మంబులు
పుట్టుకతో పుట్టవచ్చు ॥అ॥

నాగరకతనైపుణ్యం
చదువు చాకచక్యంబులు
పల్లెటూరి పిల్లకేవి! ॥అ॥

నా వన్నెలు నా చిన్నెలు
రంగుపూల సింగారం
తోటలోని తీగకేడ
అని మీలో అనుకొందురు, ॥ఓ॥

మాపల్లెల పడచుతల్ల
మాతోట్టల తీవెలతో
తిరుగుచుండ తిలకింపుడు

తేడా మీకే తెలియును
చదువుండియు సమకూరని
సచ్ఛీలం సన్మార్గం
పల్లెటూరి పడచుల్లకును
తోటలోని తీగెలకును
వెన్నతోడ బెట్టినవే ?          ॥ఆహా॥

॥ఓహో॥



## —: చతురాశ్రమ చతుర్వర్ణములు :—

చతురాశ్రమ ధర్మంబులు
చతుర్వర్ణ కర్మంబులు
చతురానన నిర్మితములు
చతురాననులనగా వా–
క్చతురతగల ఋషులందము

బ్రహ్మచర్య వ్రతముబూని
గురుకులమున నారితేరి
గార్హస్త్యము గైకొనుచును
సంతానము సంభవింప
మున్యాశ్రమముల జేరుచు
సన్యాసాశ్రమములనందు
కాలంబును గడపుటయే
చతురాశ్రమ సారమంద్రు

విశ్వమునకు విజ్ఞానము
బోధించెడి బుధవరులను
బ్రాహ్మణులని పలికినారు
పరరాజుల భయముబాపి
ప్రజలబాధ పరిహరించి
శాంతిగొలిపి శాశించిన
క్షత్రియుడను జాతియగును
వస్తువినిమయము జేయుచు
వాణిజ్యము చేయుచున్న
వైశ్యులనెడి వంశంబగు

హలముతోడ పొలముదున్ని
పైరుపెట్టి పండించిన
హాళికుడని యనుచుండిరి
గుణకర్మ విభాగంబుల
కులధర్మము గలిగెననుచు
గీతలోన వ్రాతగలదు
పరధర్మము పాటింపక
తనధర్మము తాజేయుచు
మరణించిన మంచిదనిరి

గుణకర్మలు కులధర్మము
కాదిప్పటి కాలంబున
జందెమేసి సందెవార్చి
పంచాగము పట్టినంత
బ్రాహ్మణులని పలుకవలయు

పరరాజుల పాదములకు
ప్రజాప్రాణ పూజజేసి
సుఖముతోడ సొక్కుచున్న
రాజులగుచు రాణించిరి

వ్యాపారం బేహారం
అంతకంత కాదాయం
అధికమైన ఆశతోడ
కూడబెట్ట కోమటియగు

హలమున్నను పొలమున్నను
పండించక పనిచేయక

ఊరువిడిచి తిరుగమరుగు
రైతునేడు రౌతయ్యెను

కులధర్మము చేయకున్న
కులములోన పుట్టినచో
చాలునన్న సరిపోవున
కులములెట్లు గలిగినవో
తెలుసుకొన్న తెల్లమగును

వాని పనిని వీడుచేసి
వీని పనిని వాడుచేసి
కర్మసంకరముజేసిరి
వర్ణసంకరము గాదిది
ఉద్దేశము సిద్ధింపని
కులతత్వంబేలయనియె
బుద్ధుడటుల బోధించెను
గాంధీయును ఖండించెను

కాని పూర్వకాలమందు
ఋషులెంతో కృషిచేయుచు
నిర్మించిన నియమావళి
నిత్యనూత్న శుభదంబులు
సత్యంశివ సుందరములు

చతురాశ్రమ ధర్మంబుల
చతుర్వర్ణ కర్మంబుల
ఐహికమున కనుగుణమౌ
ఫలితంబులు గలుగుచుండు

విద్యార్థుల విద్యార్జన
సక్రమముగ సాగుచుండు
గృహమేధుల గృహధర్మం
సామ్యముగా సాగుచుండు
వానప్రస్తాశ్రమమున
వనవాసము చేయుచున్న

పట్టణమున పల్లెలలో
సమ్మర్దము సమసిపోవు
సంఘములో సంఘర్షణ
దానంతట తగ్గిపోవు
అత్తగారి పెత్తనములు
కోడండ్రతో కొట్లాటలు
కలుగుటకే వీలులేదు
బ్రహ్మచర్య వ్రతదీక్షను
సలుపుచున్న సంతానము
పుట్టుటకును గిట్టుటకును
చట్టములే పుట్టబోవు
వనములోన వసించెడు
వారచ్చట దొరుకుచున్న
కందమూల ఫలభక్షణ
కావించిన కలకాలం
తిండి కొఱతలుండబోవు
ఆశనిరాశైపోవును
అవినీతియు నడుగంటును

కామార్తులు కక్కుర్తికి
పాలుపడుచు బలముపోవ
దుర్బలులదౌర్భాగ్యము
కలుగబోవు కాలమొచ్చె

గుణకర్మల గణియించుచు
అధ్యాపకు లుద్యోగులు
కర్షకులని కార్మికులని
రక్షకులని శిక్షకులని
వివిధంబుగ విభజించిరి

కులధర్మము కూలిపోయి
పలురకముల పనులజేయ
తికమకమౌ తెగలుగల్గె
ఎవరెవ రేయేవృత్తిని
చేయుచున్న జీవనమును
సాగించెడు సాధనమే
ఎప్పుడైన తప్పు విట్టి
భేదంబులు పృథివిలోన
ఐన వాని ననుకొనకయె
అధము లధికులను భావము
కలుగనీక మెలగవలయు
అంగీకృతమగు ధర్మము
సక్రమముగ సాగించిన
మనజాతియు మనదేశము
పూర్వకాల భోగభాగ్య
ములతోడనె తులతూగును

63

మనపూర్వపు మహనీయుల
తలచుకొన్న తనువంతయు
పులకరించు జలదరించు
అంతటి మన యౌన్నత్యం
ఒంతయైన కొంతయైన
గ్రంథంబుల కానగును
భావికాల ప్రజలైనను
తెలుసుకొన్న చాలులెమ్మ*





# లంచము



లంచమా! నీకెంత సంచిత పుణ్యమే
నీకున్న గౌరవం నేడులేదెవ్వరికి
కొండంత భక్తితో కోర్కెతీరినదాక
నిన్నుకొలిచేవారే నిన్నుతలచేవారే
నిన్ను ఆరాధించి నీసేవచేయుదురు
ధనధాన్య వస్తు [illegible]రూపములతోడ

మణిమయభూషణ [illegible]రూపాలతో
పానీయ ఫలహార పంచభక్షాలతో
మధుమాంస వ[illegible] మా[illegible]ల
వివిధరూపాలతో వె[illegible]దె
విశ్వరూపముతోడ విశ్వమంతానీవె
దేదీప్యమానముగ దీపించుచున్నావు
అధికారులందరు ఆదరిస్తున్నారు
రక్షకభటు లాహా! రక్షించుచున్నారు
పాలకులెంతయో పాలించుచున్నారు
మనుజులందరు నీకు మన్ననజేతురు
లంచంబులేనిదే మంచమెక్కరుకదా!
కాసులులేనిదే కదలదే కాగితం
నెరవేరదే పని నీవులేకున్నచో
బహువిధలీలలు బహుభంగిమలు గలి

హావభావముతోడ శివతాండవముబోలె
లావణ్యరూపాన లాస్యంబుచేసెవు
నోటులేనిదే జనుల్ ఓటివ్వమంటారు
నాటుసారాకైన ఓట్లమ్ముకుంటారు
ప్రతిఫలించిదియేమొ పాపమవ్వారికి
పంచెలు కంచాలు బాటలోపరచియో
అర్జించువారలె వ్యర్థజీవనులన్న
బలవంతముగ ధనంబర్జించువారలు
ధనమివ్వకున్నచో పనులుచేయనివారు
యాచకులను మించి నీచులైపోయారు
పరధనంబాసించి పనులుచేయనివారు
పాడుచేస్తేవారు కీడుచేసేవారు
అధికారులంతకు నధములైపోయారు
ప్రజలసొత్తును తిని బ్రతుకు ఉద్యోగుతే
పైధనములేనిదే పనిచేయకున్నారు
ఒకశాఖలోనున్న ఉద్యోగులకునైన
చట్టసమ్మతముగా ముట్టవలసినదైన
ముడుపులివ్వకయున్న ముట్టజెప్పరుకదా!
నీకింతవస్తుంది నాకెంతయిస్తావు
యివ్వకుంటే చిల్లి గవ్వరాదంటారు
ప్రజలుకట్టిన ధనం ప్రజలకిచ్చుటకైన
ఉద్యోగులకింత ఊరకివ్వాలట
అన్యాయములకైన నసమానతలకైన
ఎదురొడ్డిపోరాడి ఏదైనచట్టాన్ని
తెచ్చుకొని ధనమును హెచ్చుగా పొందిన

దానిలో దానాలు ధర్మాలుచేయాలి
ఇన్నాళ్ళబాధలు ఎవరేమితీర్చారు
వారబ్బసొత్తైన వీరికిస్తున్నారా?
పగలుజేబులుకొట్టు పరిపాలతులకన్న
లంచాలు యాచించు లుంఛాలకన్న
పగలుపస్తులుపడి బ్రతుకుమార్గములేక
రాత్రి చౌర్యముచేయ రాత్రించరులు మేలు
తనధర్మమును తానుతప్పకచేయుటే
అన్నిధర్మములకు మిన్నయౌధర్మంబు
పనిభారమెక్కువై పనులుకాకున్నచో
తప్పులేదని మనం చెప్పవచ్చునుగాని
పనిబాటలేకున్న ప్రతిఫలములేనిదే
పనిచేయకున్నట్టి పరమనీచులనెల్ల
నడివీధిలోనిల్పి నాటుకట్టెలతోడ
చావమోదినగాని చావవే లంచమా!
అధికారమర్దంబు అంగబలమున్నను
ఉన్నతోద్యోగాలు ఉర్విభాగాలున్న
సర్వాధికారులు సంపన్న వర్గాలు
విద్యాధికారులు వైద్యాధికారులు
సంపాదనే తమ సర్వస్వముగనెంచి
నీపంచజేరేరు నిన్నుసేవించేరు
రెండుచేతులతోడ దండిగాగుంజుచు
నిండుప్రాణముతీసి రెండుజేబులునింపి
పేదలపీకల పిసుకుచున్నారు

## 67

పీడితజనులనే పీడించుచున్నారు
లంచమా పేదల వంచనచేయకే
మాయలోపడిపోక మంచిగాబ్రతకవే
ఆశాపిశాచమా? అవినీతి భూతమా?
మిర్రైనవీరిని మీరకున్నారేల
ప్రజలనీరీతిగా పట్టి బాధిస్తారు*



## -: స్వార్థ పదార్థము :-

స్వార్థపరార్థముల నడుమ సాగుచుండు సంగ్రామం
మానవ మానస సంగర మహారంగమందు నెపుడు.
జయము స్వార్థమునకైతే జగమునకే యనర్థము
జయము పరార్థమునకైన జగమునకేగు సార్థకము
తన తనువును తన విద్యను తన భూమిని తన గృహమును
తన కళత్ర పుత్రపౌత్ర ధనధాన్యాదులనెల్లను
పరార్థమున కుపకరింప పరితపించు పరమాత్ముడు
పరతనువును పరవిద్యను పరభూమిని పరగృహమును
పరకళత్ర పుత్ర పౌత్ర ధన ధాన్యాదులనెల్లను
స్వార్థంబున కుపకరింప ప్రయత్నించు పరమ పాపి
పరార్థపరుడు రాముడే, స్వార్థపరుడు రావణుడే
తన సుఖమును తన రాజ్యము తన కళత్ర పుత్రాదులు
వదలివేసి వనముజేరి ప్రజల కొఱకు పాటు పడెను
భగవానుడు బుద్ధుడు, తన కార్యము తలపోయక
ప్రజాకార్యపరుడగుచును. ఆనందంబనుభవించె
మహనీయుడు మహాత్ముడు మోహన్‌దాస్‌గాంధీజీ
పరుల కొఱకు పాటుపడుచు బ్రతుకువాడు పావనుడగు
అంతవఱకు స్వార్థమచట అంతమొందినటులేలె
తనపని తానొనరించుచు. పరులపనులు చేయుచుండి
మనుచున్నను మానవుడగు
పరులు బాధపడుచున్నను పరకార్యము భగ్నమైన
తోటి మనుజకోటికెల్ల నపకారంబగుచున్నను
తన కార్యము కొనసాగిన అదాయంబగుచుండిన

చాటుచుంచు తలపోసెడి వారలున్న వారలిపుడు
మానవత్వమునుగూడా మంటగలుపు మహనీయులు
అట్టివారినధములనిన నీచులనిన నేరమేమి ?
వ్యర్థముగా పరుల పనులు పాడుచేయు పాపాత్ముని
తోటి ప్రాణికోటికెపుడు హానిచేయుమేనివాని
హత్యచేసి ఆనందంబనుభవించు అధమాధము
పేరుపెట్టి పిలుచుటకే భాషలోన పదములేదు
వారుచేయు పాపంబుల వాఙ్మయమున వర్ణించుట
కైనగాని అలవికావు. చెప్పుటకే చేతగాదు
సర్వలోకచక్రవర్తి కావలెనను కాంక్షతోడ
కళింగమును కలతపరిచి శోకభీకరాకరమౌ
రక్తసిక్తరణరంగము హస్తపాదమస్తకాది
ఛిన్నభిన్నఖిన్నానన యోధ భాధ గాధ వినుచు
మరణించిన మనుజులకై పరితపించు బంధువులను
కనులతోడ గాంచగా నశోకునకే శోకమయ్యె
కరుణతోడ కరగిపోయి మనసంతటుమారిపోయె
స్వార్థము పరార్థంబు జయమచ్చుట చాటించెను
పరుల కొఱకు పాటుపడెను ప్రాణిహింసమానిపించె
స్థూపంబుల స్థాపించెను బాటల కిరువైపులందు
వృక్షంబుల నేయించెను. విహారముల నిర్మించెను
అశోకరాజు శోకముచే శోకహీన లోకమయ్యె.





## రామ రాజ్యము

రామాలయ మూరూరను
రామాయణమింటింటను
ఎటుచూచిన రామచిత్ర
మెందుగనిన రామప్రతిమ
ఆననమున రామనామ
మాలయమున రామభజన
అన్నియున్నవసత్తైనది
ఆచరణంబగుపించదు
ఆదర్శంబనుకరణం
బావంతయు కనుపించదు
రాముగాథ కావ్యంబుగ
రచియించిన వాల్మీకుని
ఆశయమీయవనిలోని
జనులందరు దాని జదివి
రామునివలెనడచుకొనుచు
రాణింపగ వలెననియే.

రామునివలె పితృభక్తియు
రామునివలె మాతృభక్తి
రామునిబోలు భ్రాతృప్రేమ
రాము సతీవ్రత మెక్కడ?
తండ్రిమాట జవదాటని
తనయుడెక్కడున్నాడు
తనయునికై తనువువీడు
తండ్రులెవ్వరున్నారు
ఆత్మలైక్యమై పోయిన
ఆలుమగండ్లెందుగలరు
ప్రాణనాథు నెదిరించని
ప్రాణేశ్వరి యెందుగలదు
అగ్రజునే అనుసరించు
అనజుడెవ్వడున్నాడు
అనుజునకే రాజ్యమిచ్చు
అన్నఎవ్వడున్నాడు
ప్రజలకొఱకు ప్రాణేశ్వరి
పాయునట్టి ప్రభువెవ్వడు
అలితోడ కాలినడక
నడవులలో యిడుములుపడు
బాగోగులు పరికించిన
దీక్షగల్గు దక్షుడెవడు

పసిపాపకు పాలిచ్చిన
బలముపోవునను తల్లియు

సంతానమె లేకుండిన
సౌఖ్యముండునను తండ్రియు
బయలుదేరినారెక్కడి
భక్తిగల్గువారిపైన
ముదుసలులకు ముసలమింక
దగ్గఅనే దాపురించు
ఆస్తులకై చంపుకొందు
రన్నదమ్ము లొకరినొకరి
ఆలుమగలమధ్య గలవు
అంతులేని తగాదాలు
ఒకరికొకరు విడాకులును
ఒకరికొకరి భరణంబులు
ప్రజలపీల్చి పిప్పిచేయు
ప్రభుత్వాధికారవరులు
ప్రబలు స్వార్థబుద్ధితోడ
పరిపాలనచేయుచుండ
రామరాజ్యమింకెక్కడ
రావణరాజ్యంబేయిక
రామాలయమందుండిన
రామభజన చేయుచున్న
రామరామయనుచుండిన
రామపూజ చేయుచున్న
రామునివలె నడచుకొనని
రావణులకు మోక్షమేడ?

ఆదిఋషుల భావంబు
లనాదిసిద్ధ ధర్మంబులు
ఆదికవుల యాశయములు
అంతమొందుచున్నప్పుడు
భావాచరణము లేనిది
బాహ్యాచరణంబేటికి
రామాలయమెందులకో
రామాయణ మెందులకో
ఊరూరను వాడవాడ
ఊరేగింపులు దేనికి.
రంగురంగు బొమ్మలతో
సింగారించుట దేనికి.
ఆనందం బాహ్లాదం
బాడంబరమగునేమొ
రాముగాథ జదువుకొనుచు
రామునివలె నడచుకొనిన
స్వయముగానె రాముడగుచు
(స్వర్గలోక సుఖములందు)
స్వర్గలోకమందుండును.



# విద్య

పాఠములను పఠియించుట
లేఖినితో లిఖియించుట
విద్యగాదు విశ్వమందు
విద్యయనగ విదజ్ఞానే
మేలు కీడు తెలుసుకొనుచు
తెలివిగలిగి మెలగుటయే!
ఉద్యోగం సద్యోగం
పఠనానికి ఫలితమౌనె
తానెవ్వడు తనువేటికి
దేశమేది దేనికతడు
జగతిలోన జన్మించెను
త్యాజ్యమేది భోజ్యమేది
స్వధర్మంబు స్వకార్యంబు
తెలియవలయు తెలిసినంత
చేయవలెను చేసినంత
చెప్పవలయు చెప్పినంత
చేయించుట శ్రేయమగును.
విద్యయొసగు వినయంబును
పాపంబును పరిహరించు
భువినరునకు భూషణంబు
దొంగలెవరు దోచరాని
దాచుకొనిన ధనమిదియే
వాణివలన రాణించును

రాజసభల పూజితుడగు
పరదేశపు బంధువగును
ఇచ్చుచున్న హెచ్చుచుండు
తరుగదెట్టి తరుణమందు
జన్మాంతర సంస్కారము
సన్మార్గము సచ్ఛీలము
చదువువలన సమకూరును
మూర్ఖత్వపు మున్నీటను
మునకలేయు మూర్ఖజనుల
దరిజేర్చెడు తరణియగును
తనవిద్యను తనబుద్ధిని
అన్యసేవ కర్పించిన
ఉత్తమోత్తముండతడే
ఆత్మీయుల కన్యులకును
ఉపకారంబొనరించిన
ఉర్వలోన ఉత్తముడగు
ఆత్మలాభమన్యహాని
చేకూర్చిన చెప్పవలయు
మహిహాతని మధ్యముడని
ఆత్మనాశమన్యహాని
అపచారం బాచరించు
అధమాధము లవనిలోన
పుట్టనేల గిట్టనేల.
చదువుకొన్న సన్నాసులె
జ్ఞానముచే జనులెల్లర

మోసగించు మొనగాండ్రట!
విద్యయిపుడు వృత్తికొఱకె
పరులదగా పఱచుటకే
విద్దెయొక్క యుద్దేశము
పూర్వముతో పోల్చుకొన్న
అంతరమెంతైన గలదు
విద్యార్థుల విద్యార్జన
ప్రయోజనము పరీక్షలె
ఉత్తీర్ణతె, ఉద్యోగమె.
కళ్యాణమె, కట్నాలె.
ధనార్జనే దానిఫలం
జ్ఞానార్జన కానరాదు.
వేషాలకు మోసాలకు
అక్రమాని కవినీతికి
ఆలవాల మగువారలు
చదువుకొన్న సత్పురుషులె.
విద్యాలయ విధానములు
పాశ్చాత్యుల దుశ్చర్యల
బింబప్రతి బింబములే.
గురుకులమున గఱపువిద్య
పాచీనపు పద్ధతులును
మనదేశము ఘనతచాటు-
అధ్యయనము అవగాహన
మాచరణ ప్రచారణములు
పతనమునకు పరమావధి. ★

## -: దేశభాషలందు తెలుగు లెస్స :-

ఓ ఆంధ్రమాత వినుమా ?
మా సాంద్రభక్తి కనుమా?
నీపక్షపాత చూపు
మా పక్షమునను జూపు
నాయాంధ్రదేశమనుచు
నాయాంధ్రభాషయనుచు
పైమాటచే యొకింత
పైచోటు జెందిరంత
నీ పేరు జెప్పి కొంత
నీఊరు వచ్చినంత
మద్రాసు విడిచినంత
భద్రాసనంబుచెంత
మద్రాసు రాష్ట్రమందు
మార్మూల సందులందు
మూరొక్కంకునున్నవారు
మూర్ధాభిషిక్తులైరి.
ఆనాడు కట్టకడన
ఈనాడు నట్టనడుము.
ఆనాడు మొట్టమొదట
ఈనాడు చిట్టచివర
పరదేశ భాషజదివి
పరమాపకారులైన
పరదేశవాసులైన
వారే మొనీకుప్రియులె!

నీపట్టునందు పుట్టి
నీపట్టుచెట్టుపట్టి
నీవ్యాప్తిజేయుచున్న
మాప్రాప్తమేమొ సున్న

నీపాదసేవజేసి
నీ పైన కవిత వ్రాసి
నీపూజచేయుచుంటె
పోపొమ్మ ఊరకంటె

ఏ నిష్ఠురమ్ముబడక
ఏ కష్టమునను జెడక
ఆకాశసీమ జిమ్మ
అరవమ్మ యెమ్మెసుమ్మ.

నీపట్టిపోయికూడ
నీకట్టివ్రాతయేడ?
నీ సంతు ప్రేమజూడ
నీ కింత తెలుసు తేడ

అనాడె అరవజెట్టి
అవినాశలింగశెట్టి
మా జీవితములగ్గాంచె
మా జీతములను పెంచె

ఆంధ్రంబు జదివియున్న
ఆంగ్లంబు జదువకున్న
అధిక్యమెంతయున్న
ఆధ్వర్యమేమొ సున్నె

ఆంగ్లంబు జదివియున్న
అన్యంబుచదువకున్న
అసలేమి తెలియకున్న
ఆతండె ఘనుడు మిన్న

ఇంగ్లీషువారి రాజ్యం
కావాలి మనకు త్యాజ్యం
ఇంగ్లీషుభాష పూజ్యం
రావాలి దానభోజ్యం

ఆంగ్లంబు ఎందుకంటె
ఆంధ్రంబు జదువుమంటె
అర్థంబుగాని మంట
అంతబ్బులేని తంట

నీవుచేయులాలనకు
నిన్నుచేయుపాలనకు
నీకింతకు తెలియలేదు
నాకంతయు తెలిసినాది

మేము నిన్నుభూషింతుము
నీవుమమ్ముదూషింతువు
నీరంగము తెలిసెలెమ్ము
మాసంగతి తెలిసికొమ్ము

నీపేరు మొదట పెట్టి
నీఊరు చివరబెట్టి
నాయకులు చేయుఘటన
నయనాల ముందునటన

దేశంబు తెలుగెగాని
వేషంబు తెలుగుగాదు
భాషేమొ తెనుగెగాని
శాసనము తెనుగుగాదు

పాలకులు తెనుగువారె
పాలితులు తెలుగువారె
తెలుగునేల తెలుగువెలుగు
మొదట తెలుగు చివర తెగులు.



# సాధారణ ఉద్యోగి

అల్పధన మనల్పశ్రమ
ఉన్న చిన్న ఉద్యోగము
బ్రహ్మ కైన భారమగును
అధికారుల కందరకును
అణగిమణగి మనవలయును
కుర్చీలో కూలబడియె
ప్రొద్దుక్రుంక దిద్దుకొన్న
తెమలనట్టి దినచర్యలు
నీరసమై నిస్పృహతో
సాయంతన సమయంబున
గేహంబున కేగిచూడ
ఉప్పుండదు పప్పుండదు
వంటచేయవలనుగాక
అలిగి అలుమూలనుండు
పిలిచినచో పలుకకుండు
ఉన్నకొద్ది ఉత్సాహము
చూపించుచు కోపపడిన
బియ్యమేవి బేడలేవి
గుడ్డలేవి బిడ్డలకని
రంపుబెట్టి రట్టుచేయు.
భార్యనెట్లొ బ్రతిమాలుచు
పిలుచుటకా వీలులేక
అంగడింటి కప్పుపోవ

పాతప్ప్వుల రోతకట్ట
విప్పిచూపి వీధిలోన
అవమానం బతడుచేయు
ప్రక్కనున్న బాలునివలె
అవికావలె ఇవికావలె
నాన్నా! అని విన్నవించి
బ్రతిమాలెడు బాలకులను
ఎల్లెట్లో ఏమోమో
చెప్పి అప్పుడొప్పించిన
మఱునాడిక మామూలుగ
కోర్కెలేవో కోరుచుంద్రు
జీవితమా జీతముతో
సాగించుట సాధ్యమవక
కలియొ గంజో కాచుకొనుచు
గడుపునట్టి కాలమందు
హల్వాయును పల్వాయును
పంచభక్ష్య పరమాన్నం
అధికారుల కాతిథ్యం
ఐనఖర్చు లందఱకును
జీతములో కోతగల్లు
ప్రయాణంపు బత్తెములును
దండుగయగు తిండితీర్థ
మధికారికె అందవలయు
బడికిపోవు బాలురున్న
తోటివారితో బాటుగ

కొరతలేక జరుగకున్న
దీనవదనులైన చూచి
మౌనబాధ ననుభవించు-
ఎన్నాళ్ళని ఈరీతిగ
సాగించుట సాధ్యమగును
అధిక ధనంబడిగినచో
ఆగ్రహ మా అధికార్లకు
ఆకలితో అల్లాడిన
ఆహ్లాదంబగునేమో
ఇంటిఅద్దె మింటికెక్కి
ధరలంతకు పెరిగెపైకి
అప్పుచేసి తిప్పలుపడి
కాలంబును గడుపునపుడు
ఆరోగ్యం అంతరించు
అప్పుడతడు చెప్పలేని
యమయాతన ననుభవించు.
కానీలే కలకాలం
ఒకరీతిగ ఉండదులే
బెదరిపోకు సోదరుడా ?
దిగులుపడుచు దిగజారకు
అధోగతికి అవినీతికి
లంచాలకు వంచెనకును
పాలుపడిన బాగుపడవు
మనోవ్యథను మఱచుటకై
మద్యమునో మత్తుమందో

సేవించిన చెడిపోదువు
ధనవంతుల ధారాళం
పైవారల పద్ధతులను
ప్రక్కలోని టక్కరులను
అనుకరించు అలవాట్లను
పూనుకొనక బుద్ధిగలిగి
ఆదాయము ననుసరించి
వ్యయముచేసి బ్రతుకవలెను ★



## :- ఉపాధ్యాయుడు :-

జగమనగా? జనగణమే
నదీనదము నగావళియు
వసుంధరా వనౌఘములును
జలనిధులును జగంబగునె
పట్టణముల భవనాలను
పరిశ్రమల పథంబులను
వారధులను నీరధులను
నిర్మించుట నేర్పగునా?
అభివృద్ధియునదెయగునా?
అజ్ఞానుల విజ్ఞానుల
అతిమూర్ఖుల మతిమంతుల
దుర్మార్గుల సన్మార్గుల
దానవులను మానవులుగ
మార్పుసేత నేర్పుగాద
సౌజన్యం సౌహార్దం
సౌదర్యం సౌశీల్యం
శాంతి. దయాసహనాదులు
ప్రజలతోన ప్రబలిననే
అభ్యుదయంబగు జాతికి
సంఘమునకు సద్గుణములు
చదువువలన సంభవించు
విద్యలేని వింతపశువు
కెంతజెప్ప నేమిఫలము

కానవిద్య గఱచుటయే
ప్రతిపౌరుని హితధర్మం.
భావిపౌరవరులగునది
బాలబాలికలుకాదా ?
వారిబాగు కోరకున్న
దేశమింక నాశనమే

పోయినదిక పోనీలే
ముఖ్యముగా మున్ముందుకు
మేలుకొన్నమేలు గలుగు
ఏదేశంబెరుగనట్టి
బాలబాలికల నెల్లర
విద్యనేర్పి బుద్ధిగూర్చి
బాగుపరచు వారెవ్వరు
అధ్యాపకులగును కదా?
అసమర్థుం డవినీతుడు
కక్ష్యలోన కడవాడగు.
విద్యార్థి యుపాధ్యాయుడు.
భారతీయ బాలకులను
తీర్చిదిద్దు దిట్టయగున ?
దానినేమి హానిలేదా ?

అర్హతయును ఆదరణయు
తలచుకొన్న తలవంపులు
అతనియొద్ద నారితేరు
విద్యార్థుల విధమెట్టిదొ
అందఱకును నవగతమే!

వ్రాసినదే వ్రాసికొనెడు
చేసినదే చేసికొనెడు
అన్యులైన యధికారులు
గుణవంతులు గణనీతులు
కావాలని కలువరింత్రు
అధికారం ఆధిక్యం
ఆదాయం ఆదరణయు
విరామంపు వేతనమును
వారికధికమగుచుండును
బడిపంతుల బ్రతుకన్నను
అందరకును అదువయగును
కూడుగుడ్డ (గూడులేక)
కాలుచున్న కడుపుతోడ
వేదనపడు హృదయముతో
బోధకులెటు బోధింతురు ?
అధ్యక్షోపాధ్యక్షులు
ప్రధాన్యుపప్రధానులు
కార్యదర్శి కాయస్థులు
సచివ సర్వ సైన్యాధిపు
లభ్యసింతు రతనివద్ద
వాద్యకార వైద్యాకార
చిత్రకార శిల్పకార
కళాకార కవిగాయక
నటశేఖర నాయకాది
సర్వులతని ఛాత్రవరులె

ఐననేమి అంగడింట
నన్నిగలవు అల్లునకా
శనిగలదను సామెతయ్యె.
గొట్టతోక గోచిపాత
పెరుగలేదు మెరుగురాదు!
అధ్యక్షుం డమాత్యుండు
విద్యాశాఖోద్యోగులు
ఉపాధ్యాయు డుత్తముండు
ఉన్నతుండు ఉదాత్తుండు
అనువారలె ధనమన్నను
మౌనవ్రతం మాటాడను.

మాటాడిన మనసురాక
ధనలోపంబను చుందురు
ఇన్నివాటికున్న ధనం
అయ్యవారి కియ్యలేదా ?

అయ్యవారికైనగాని
ఐకమత్య మసలుండదు
ఒకరిమాట ఒకరువినరు
సంఘాలకు సవతిపోరు
తెగల నడుమ రగిలిమండు
వారికర్మ వారిదిలే !

పంతులన్న బడికిపోక
వీధులలో విహరించుచు
అధికారుల ననుసరించి
తిరుగమరుగు వారుగలరు

ఆచార్యు డనాచార్యుడు
కారాదే కాలమందు
ఏలనన్న బాలురెల్ల
అతనికున్న యలవాట్లనే
అభ్యసింతు రధికముగా

చక్రాకారములే క్రమముగ
తిరుగుచున్న తిరుగనిమ్ము
క్రిందుమీందు లెండైనను
జరుగుచున్న జరుగనిమ్ము
నేమిమీద సాముచేయు
నేర్పుగల్గి నిలుచుచుండుము
నీతిదప్పి గోతిలోన
పడిపోతివ చెడిపోదువు.
పట్టభద్రుడైనవాడు
పాండిత్యము గలుగువాడు
సదాచార సంపన్నుడు
ఉపాధ్యాయు డొక ఊరికి
ఒకడున్న ఉపకరించు
వానికిచ్చు ధనమన్నను
దినమునకే తిండికవదు
కూలిపనే మేలుకలుగు
పనికి తగిన ధనమునిచ్చి
పనిచేయని బడిపంతుల
దండించిన తప్పులేదు!
బడులు గుడులు మడులు దేశ
పురోగతికి కారణములు ★





## —: మోహపూరి కాలభైరవుడు :—

మాదేవళంబు మహాదేవళంబు
మహాదేవదేవాత్మజా దేవళంబు
ఏలనోకాలంబు కలిసివచ్చుటలేదు
అభివృద్ధిగాకున్న నటులపోవగనిమ్ము
శిథిలమై జీర్ణమై చెడిపోయె పడిపోయె
మొగమూరు నదిదరీ మోపూరీ గిరిఝరీ
కలవు సన్నిధిలోన కలదుపెన్నిధిమాకు
ఉద్దండముగపారు ఉద్దండవాగున్ను
కలకలామెలమెలా కదలు మొగమూరు
జరాజరా ప్రవహించు గిరిదరీ నిర్ఝరిణి
సంగమంబై యచట సంగమేశ్వరమేగు
సూర్యచంద్రులొకింత సొలసి విశ్రాంతికై
మోహనాచలముపై వాహనంబుల నిల్పి
కైలాస శిఖరాల కాలదన్నగజాలు
గోపురంబులలోన రేపుమాపుంటారు
మోపూరుకొండపై ముదముతోనున్నాడు
స్వయముగా వెలసినస్వామి భైరవుడు
ఆసామిదయతోడ నచటవెలసినశాల
కల్పవృక్షముమాకు కామధేనువుమాకు
దేవవిద్వజ్జనులు దేవర్షిబృందంబు
చిన్మయుడు సద్గురుడు చిద్గగనఋషివరుడు

శ్రీ సనందస్వామి శ్రీ అభయానంద
మరికొందరాయన మహనీయశిష్యులు
దీవించి నిలపిన దివ్యవిద్యాలయము
మాపాఠశాలయే మహాపాఠశాల
మరే పాఠశాల సరిసాటిరాదు
ప్రకృతిసౌందర్యమ్ము పరికించి చూడంగ
మాకొండపైనుండి మమజూడెవ్వండైన
కనుగొన్నమాత్రాన కనుచూపు దూరాన
కదిరి నరసింహుండు గండి యనుమంతుండు
సంగమేశ్వరభవుడు సాక్షాత్కరించెదరు
మూడూర్లనడుమున మోపూరుకొండపై
వల్లభరాయుండు వాల్లభ్యమొనరించె
క్రీడాభిరామంబు క్రీడించె నచ్చోట
శ్రీనాథుడొలికించె శృంగారభావాల
పీఠాధిపతి బృహత్పీఠ మచ్చటనుండె
ఆకొండపైనుండి ఆలోకనముజేయ
ఊర్లువాడలు యేర్లు పైరు పచ్చపొలాలు
చెఱువులు కుంటలూ చెట్లుచేమలు చేలు
అష్టదిక్కులలోని యందచందంబులు
ప్రకృతి సౌందర్యంబు ప్రత్యక్షమగుచుండు
ప్రళయకాలమునాడు విలయతాండవమాడు
గగనచుంబితమైన గంభీరకాయుండు
మోహనగిరిపైన మోహంబుజనియింప
కాపురంబున్నాడు కాలభైరవస్వామి
హరిహరాభేదంబు అచటనున్నదిగాన

శివకేశవులు గలరు చెరియొక్కచెంపన
గణనాయకుడుగలడు క్రౌంచధారుడుగలడు
మాత మహిషాసురమర్ధినీ గలదచట
పెద్దబాగాదమ్మ చిన్నబాగాదమ్మ
భైరవేశ్వరస్వామి భామలిద్దరుగలరు
పైకేగునపుడు ప్రక్కప్రక్కననున్న
అక్కపప్పూరమ్మ చక్కన్నిమాపిన్ని
ముదుసలి మాయవ్వ మునలిగంగమ్మయు
ముందుపూజలుగొని మురిపెంబుచూపేరు,
విక్రమంబునుజూపి విఖ్యాతిబడసిన
వీరులప్రతిమలు వరుసగానున్నవి
గడ్డాలు మీసాలుగల యోగివర్యుల
సిద్ధుల సాధ్యుల శిలలుకూడాగలవు
అమల బౌద్ధారామ మా నేల నెలకొనె
సర్వమత సహనంబుల సామరస్యము గల్గె
ననుటకు మరికొన్ని యవశేషములుగల్గు

ఆకాశమునతాక నఱ్ఱుచాచు వనాల
కుహుకుహూనినదాన కోకిలలు చెలరేగ
ఒకవంక గోరువంక ఓరచూపులజూడ
చిలుకలొకకెలనను సిగ్గుతో తలవంచ
ఉడుతబుడతలువేగ నురుకుచుండుటచూచి
హాయిహాయియనంగ నానందముప్పొంగు
ప్రాకారములు తమయాకారములు వీడ
గుడులు గోపురములు మడులు మాన్యంబులు
పడిపోవ చెడిపోవ పట్టించుకోరేల

రండితమ్ముల్లార లెండిచెల్లెల్లార
యువతరమువారైన ఉరకండిముందుకు
మార్కండ మునివోలె మాగుడులు బడులు
కాలభైరవ నిన్ను కౌగిలించినవయ్య
కాలుడెవ్వండైన కదలింపజూచిన
వాని ప్రాణముతోడ పోనీయ వలదయ్య.
నీతోడ వరమంది, నిన్ను నాశముచేయు
భస్మాసురులనెల్ల భస్మంబు చేయుటకు
నీచేతకాకున్న - మాచేతనగునయ్య.
మురహరునితోనైన. మొరపెట్టుకుంటాము
తరిమిభస్మాసురుల తల పగులగాచేయు.
నిను నీవు కాపాడుకొనలేని మనలేని
దేవుడవు మమ్మేమి కావగలవాడవని
ప్రజలెల్ల గుమిగూడి - పలువిధంబులుగాగ
ఎకెసెక్కెమాడేరు ఎగతాళిజేసేరు
శ్రద్ధగా యికనైన, ఉద్ధరింపగలెమ్మ
కనులుదెరువుము దేవ కాలభైరవుడా?
జయభైరవేశ్వరా! జయభైరవేశ్వరా!
జయ విజయ దిగ్విజయ జయ భైరవేశ్వరా. ★



# ...గాయములలోని లోపములు...

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 9 | గవుల | గలవు |
| 10 | బింబిరములు | బంబరములు |
| 11 | సాహిత్య | సాహిత్యం |
| 12 | అరమైన | అర్థమైన |
| 13 | మల్లికలను | మల్లికలును |
| 13 | పలుక | పలుకె |
| 15 | కనితంతయు | కవితంతయు |
| 18 | రములు | రవాలు |
| 18 | కార్మక | కార్మిక |
| 26 | వాపుపుట్టు | వాపుపుట్ట |
| 27 | కలవాడ | కలవాడా! |
| 29 | త్రాగుచునున్నారు | త్రాగుచునుండిరి |
| 30 | శుభమసటంచు | శుభమస్తటంచు |
| 31 | సహదేవుదావుల | సహదేవుడావుల |
| 31 | ఆశ్రమంబులోన | ఆశ్రమంబులలోన |
| 33 | పోవు | పోవ |
| 33 | పోతివి | పోతివ ? |
| 35 | జేసికొనిరి | వ్రాసికొనిరి |
| 35 | అటులైన | అట్టులైన |
| 37 | ననుచు | నను ను |
| 37 | అగుపించెడు | అగుపించెడు |
| 38 | మొదలింటి | మొదలంటి |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 40 | శిపలేల | శివలీల |
| 41 | అన్నిమై | అగ్నియై |
| 42 | కొదండ్రుడు | కోదండ్ర |
| 42 | ఆమెపై | అలిపై |
| 42 | ధర్మ మెచ్చెటలేదు | ధర్మ మెచ్చుటలేదు |
| 44 | సాదు | సాధ |
| 45 | ఎం.ఎల్.ఏ.గా | ఎం.ఎల్.ఏ. |
| 46 | సాహాయ్యమ్ము | సాహాయము |
| 47 | నపుడైన | నప్పుడైన |
| 47 | ఖూనీలు | ఖూనీలకు |
| 48 | నెత్తియు | లెత్తియు |
| 49 | లేరయా! | లేరయ్యా? |
| 49 | అందరొకటి | అంరరొకటె |
| 49 | అదికాస్త | అదికాస్తా |
| 51 | వ్యవహారా- | వ్యవహారా |
| 51 | నియమీంచిచెను | నియమించెను |
| 53 | రెమ్మల | రెమ్మలను |
| 54 | రత్తకాంతి | రక్తకాంతి |
| 55 | నప్పుడు | నపుడు |
| 56 | పుట్టవచ్చు | పుట్టివచ్చు |
| 58 | మములనందు | మములందు |
| 61 | వసించెడు | వసియించెడు |
| 62 | దుర్బలుల | దుర్బలులౌ |
| 63 | బంతయైన | బంతమైన |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 64 | గలి | గల్గి |
| 65 | ఉద్యోగులకింత | ఉద్యోగులకునింత |
| 66 | చున్నారు | చున్నారమ్మ |
| 68 | కేగు | కగు |
| 68 | మహాత్ముడు | మహాత్ముండు |
| 69 | స్వార్థము | స్వార్థముపై |
| 69 | సేయించెను | వేయించెను |
| 71 | అనజుధు | అనుజుడు |
| 71 | ఇడుములుపడు | ఇడుములుపడి |
| 72 | ఒకరినొకరి | ఒకరినొకరు |
| 76 | కట్నాలె | కట్నాలే |
| 77 | మూర్ఛింకు | మూర్ఛించు |

